# పద్మకోశము

## సాహిత్య వ్యాస సంపుటి




డా॥ ధారా రామనాథశాస్త్రి.



జననీ జనకులు

శ్రీమతి ధారా సత్యవతమ్మ

శ్రీ ధారా వెంకటేశ్వర శాస్త్రి గారల

పాదపద్మములకు

భక్తితో సమర్పితము

# విషయ సూచిక.


సమర్పణ

వినతి

కలరవం - శ్రీ ఉషశ్రీ

వికచకమలము. ఆచార్య దివాకర్ల వేంకటావధాని

నాట్యావధాన కళ 1

నాకునచ్చిన పారిజాతాపహరణము 10

సాహిత్య ప్రయోజనము 23

నేను చదివిన ఉత్తమ గ్రంధాలు 33

రాఘవ స్మృతి 41

ఎఱ్ఱన వర్ణనా వైశిష్ట్యం 57

పోతన నరకాసుర వధ 67

భాగవత కృష్ణ 77

రామకృష్ణుని రాధ 89

ఎక్కిరాలవారి గోద 101

# సమర్పణ

ఎన్ని జన్మల దీర్ఘగల నీ
కన్నతల్లి కరుణా ఋణమ్మును?
ఏమిచేసి యీ గంగలాడను
తాత పాదుల దయా ఋణమును?

జన్మనిచ్చిరి మురిసిపోయిరి
చదువునిచ్చిరి తనిసిపోయిరి
జన్మజన్మల పీడజాలని
సవిత్రు దేవిని కట్ట బెట్టిరి.

ఒప్పులన్నవి కొలది యైనను
మెప్పుదల చిన్నెలను చూపిరి
తప్పులన్నవి కొల్లలైనను
పోని లెమ్మని యూరకుండిరి.

నిండుమనసున పదిలముగా
నిర్నిద్ర ప్రేమను నిరూపించిరి
గుండెలోతుల వత్సలామృత
కుల్యలను కురిపించి మించిరి.

చదువుసాముల పదిలపరానా
బ్రిదుకు రీతులు తమకు మురిపెము
అర్ధసాధన వ్యర్థమైనను
అసంతృప్తియె కలుగ దెచ్చుట.

ఇదియె యొక గురుయోగ బలమని
పదవి పైకము లలనులమ్మని
నల్వురిలో తమ పెద్ద బిడ్డడు
నాణెముగ నెగడుటయె చాలని

తలచినది నా పాలివరమై
నిలిచినది నాకిహపరమై
నేటివరకూ బ్రదుకు బాటల
నేటి దనముల నందగంటెని.

అన్నపూర్ణకు తీసిపోవని
ఆర్ద్రిహృదయము అమ్మగారిది
సంప్రదాయపు గేస్తురాలిగ
సర్వులామెను సన్నుతింతురు.

నాట్యవిద్యా నైపుణమ్మున
నాణెమౌ స్థితి నాన్నగారిది
సిగపూవు వాడని భోగియాయన
గంభీర జీవనయోగి యాయన.

కన్నవారల ఋణము తీర్చుట
కెన్ని యుపదలు తేగలాడను?
తెచ్చి యిచ్చిన ఏని తీరునె
తీర్పరాని ఋణాను బంధము!

అట్టివారల పాదపద్మము
లంటి నాయీ పద్మకోశము
పెట్టినాడను చిన్నియుపదగ
పుట్టి పెరిగిన యిన్నియేళ్ళకు.

శ్రీయఃపతి కరుణార్ద్ర దృక్కుల
చిరంజీవిత శోభనందిన
తల్లిదండ్రుల చల్లదనముల
నెల్లకాలము మేము మనవలె.

పద్మకోశము పట్టి చదివిన

పాఠకోత్తమ హృదయసీమల

సాహితీ మాధుర్య ఝల్లులు

జాలువారును శాశ్వతమ్ముగ.

# వినతి

***********

ఆకాశవాణిలో ప్రసారమైనవీ, విడిగా వ్రాసినవీ మొత్తము పది వ్యాసాలు ఈ సంపుటంలో సహృదయ లోకానికి సమర్పిస్తున్నాను. రాఘవస్మృతి, రామకృష్ణుని రాధ, ఎక్కిరాలవారి గోద తప్ప అన్నీ ఆకాశవాణిలో ప్రసారమైనవే. ఈ పుస్తకములో చేర్చడానికి అనుమతించిన ఆకాశవాణి వారికి కృతజ్ఞుడను.

'కలరవం' పలికిన ఉషశ్రీ గారికి నమస్కారములు. సంపుటాన్ని సాకల్యంగా పరిశీలించి విపుల పరిచయం వ్రాసిన దేశికోత్తములు, విద్వాంసులు, సాహిత్యమహోదధి ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారికి ప్రణామ పరశ్శతములు.

మా జ్యేష్ఠ పుత్రిక చి॥ సౌ॥ చెరువు లలితకుమారి ముఖచిత్రం కూర్చింది. ఆమెకు సకుటుంబముగ సమస్త సన్మంగళములు కలుగుగాక! ముద్రాపకులు శ్రీ రత్నం ప్రెస్ వారు, ప్రచురణకర్తలు మధుమతి పబ్లికేషన్స్ వారు నా కృతజ్ఞతకు పాత్రులు.

మకరసంక్రాంతి
14-1-1982
ఒంగోలు.

ధారా రామనాథశాస్త్రి.

# కలరవం

దేశంలో సంప్రదాయ పరిరక్షణదీక్షితుల సంఖ్య అసంఖ్యాకమే అయినా సంప్రదాయ విధ్వంసన ప్రియులు అల్పసంఖ్యాక వర్గం కావడంవల్ల ఆ మైనారిటీల కల్లోలాలు కొందరిని కలవరపరచే మాట వాస్తవం. కలవరపడుతున్న సహృదయులకు కలరవాలు వినిపించి వారి అభినందన లందుకునే అగ్రశ్రేణి సారస్వతోపాసకులు ధారా రామనాథశాస్త్రి గారు. నాట్యావధాన స్రష్టగా ప్రఖ్యాతులై రజతోత్సవం జరుపుకొని, సాహిత్య రంగంలో పరిశోధన సాగించి డాక్టర్ పట్టాపొంది, ఆయా అనుభవ సమ్మేళనంతో చక్కని పరిశీలనాత్మక వ్యాసాలు అందించారు.

ప్రాచీన సాహిత్యంలో వారిని అలరించిన గ్రంథాల విశేషాలను ఈ నాటి యువతరానికి "చిక్కని" తెలుగులో అందించారు.

విశ్వవిద్యాలయాల వారు నిష్పాక్షిక దృష్టితో ఇటువంటి విశేష విషయభర గ్రంథాలను తమ విద్యార్థులకు పఠనీయంచేస్తే తమ బాధ్యతను గుర్తించిన వారవుతారు. రసజ్ఞులు చదివితే సంతృప్తిగా మరో దశాబ్దం సాహితీ సమారాధనం చేయగలుగుతారు.

విజయవాడ
వైకుంఠ ఏకాదశి
6-1-1982

ఉషశ్రీ

# వికచ కమలము -

## ఆచార్య దివాకర్ల వేంకటావధాని

మిత్రివర్యులు డా॥ ధారా రామనాథశాస్త్రి గారు రచించిన పద్మకోశమను వ్యాస సంపుటమును చదివి యమందమైన యానంద మందితిని. పద్మకోశమనగా తమ్మి మొగ్గ. కాని యిందలి భావ వికాస రస మకరందములను పరిహించిన దీనిని వికచ కమలమని చెప్పవలయును. ఈ కోశము నందలి ప్రతి దళమును ఆప్యాయమైన సౌరభముతో గుబాళించుచు సహృదయ హృదయ బంభరముల నాకర్షించుచున్నది. ఇందలి వ్యాసములు కొన్ని ఆకాశవాణి ద్వారా ప్రసారము చేయబడినవి. కొన్ని యిటీవలనే వ్రాయబడినవి.

డా॥ శాస్త్రిగారు నాట్యావధానమునకు స్రష్టయు ప్రయోక్తయునై పేరుగాంచిన వారు. నాట్యావధానమొక గొప్ప కళ. అంతభినయ కవితా సాహిత్య కళలన్నియు నిమిడియున్నవి. దానికింత వఱకు లక్షణము చెప్పిన వారెవ్వరును లేరు. శాస్త్రి గారిందలి మొదటి వ్యాసమున దాని లక్షణ స్వరూపములను చక్కగా నిర్వహించి ఆ కళ నభ్యసింప దలచిన వారికి చక్కని మార్గమును సూచించియున్నారు.

మానవజాతి కవసరమైన శాశ్వత సత్యములను సరసముగా శిల్పముతో పొదిగి ప్రయోగించు పద్ధతిని ప్రకటించియున్నారు.

నంది తిమ్మన పారిజాతము. ప్రబంధోద్యానమున నుదయించిన నిత్య నవ్య పారిజాతము. "పరిమళము చెడదు వాడదు" ఇత్యాతిగాతిమ్మన వ్రాసిన పద్యము పారిజాత పుష్పమున కే కాక యతని ప్రబంధమునకును అన్వయించును. అతడు హరి వంశమునుండి కథను గ్రహించి అందలి అంశములను కొన్నిటిని పరిహరించియు కొన్ని అంశములను క్రొత్తగా చేర్చియు నీ ప్రబంధమును సంతరించినాడు. ఇందు శృంగారవీర రసములనాతడు పోషించిన తీరు ప్రశంసా ప్రాత మైనది. ప్రబంధాంతము నందలి పుణ్యక వ్రతమువానికి శాంత చ్ఛాయనుకూడ జత చేసినది. శ్రీ శాస్త్రి గారీ ప్రబంధ మందలి రసపాత్ర పోషణమును, వర్ణన పాటవమును, సంభాషణ సౌందర్యమును చక్కగా ప్రదర్శించి యున్నారు. తిమ్మన కృష్ణావతారతత్త్వమును ప్రదర్శించుట యందును, కృష్ణుని జగన్నాటక సూత్రధారిగా చిత్రించుట యందును, అందలి వాత్సల్య భక్తిని ప్రపంచించుట యందును, చూపిన నేర్పు ప్రతిమానము. దండకము నందతడు స్వామిని షట్చక్రభేదనా

నంతర జ్ఞేయమైన కుండలిని శక్తిగా నభివర్ణించుట అతని శ్రీ కృష్ణతత్త్వ యాథార్థ్య పరిజ్ఞానమునకు తార్కాణం.

పూర్వలాక్షణికులు సాహిత్య ప్రయోజనములను పలువిధములు ప్రకటించి యున్నారు. అందు సద్యః పర నిర్వృతి పార్యంతికమైనది. దానిని లాక్షణికులు బ్రహ్మానంద సబ్రహ్మచారిగా నిర్దేశించినారు. ఋగ్వేదమునందలి మధుమతి భూమిక దీనికి ప్రతీకగా శ్రీ శాస్త్రిగారుదాహరించినారు. కావ్యము విశ్వజనీనమైయుండుటే కాక పరమాత్మ లక్షణమైన శాశ్వత ధర్మగోప్తృతకు సాక్ష్యమై యుండవలెనని వారి ప్రతిపాదన. భారత రామాయణ భాగవతములు మహా కావ్యములై శాశ్వత ప్రతిష్ట నందుటకు నిజమైన కారణమిదే.

శ్రీ శాస్త్రిగారు నేను చదివిన రెండుత్తమ గ్రంథములను వ్యాసమున సిద్ధేంద్ర యోగి భామా కలాపమును. త్యాగరాజ స్వామి నౌకా చరితమును సమీక్షించియున్నారు. సిద్ధేంద్రయోగి సత్యభామ కాంధ్రుల హృదయములలో శాశ్వత స్థానము కల్పించినాడు. అతని మాధవి బ్రహ్మ తత్త్వమునకు మాఱు రూపమైన కృష్ణ తత్త్వమును లెస్సగా

ప్రకటించినది. త్యాగరాజు నౌకా చరితమున జీవాత్మను పరమాత్మలో లయము చేయుటయే పరమార్థమని గోపికల ద్వారా వ్యక్తీకరించినాడు. అతడు శరణాగతి ఫలితమైన సాయుజ్యమును మధుర భక్తి సంప్రదాయాను గుణముగా వ్యాఖ్యానించిన తెలుంగప్రతి మానవముగానున్నది.

శ్రీ బళ్ళారి రాఘవ నాట్యతపస్వి. బహుభాషలలో బహుపాత్రలను అనన్య సాధ్యముగా నటించి మనదేశమునందే కాక పరదేశములందును అపారకీర్తి గడించిన ధీశాలి. ఆయన పౌరాణిక పాత్రలను కూడ రసభావానుగుణముగా అభినయించి నాటకరంగమునకు గొప్పవికాసము చేకూర్చినారు. దానికి ఆయన అధ్యాత్మిక జిజ్ఞాసయు, దీనజనోద్ధరణా సక్తియు నెన్నో విధముల దోహదము కల్పించినవి. ఆయన నాట్య రంగమునారాధన బుద్ధితో సేవించి దానికెట్టంతర్జాతీయ ప్రశస్తి చేకూర్ప జాలినారో శ్రీ శాస్త్రిగారు చక్కగ నిరూ పించియున్నారు.

కవిత్రయమువారిలో నన్నయ కథనపద్ధతికిని, తిక్క న సంభావణ విధానమునకును, ఎఱ్ఱన వర్ణ వైశారద్యమునకును గజబంతులైనట్లు విమర్శకులు చెప్పుదురు. ముగ్గురియందు

మూడు గుణములున్నను ఒక్కొక్కరియందొక్కటి ప్రాధాన్య ము వహించినది. ఘోష యాత్ర. రామాయణములందలి వర్ణనలనుదాహరించుచు శ్రీశాస్త్రిగారెట్టి వర్ణనా వైచక్ష ణ్యమును విశదీకరించియున్నారు.

పోతన భాగవతమునందలి నరకాసుర వధవృత్తాంత మత్యంతరమ్యమైనది. అందతడు చిత్రించిన వీర శృంగార సమ్మేళనము నాన్యతోదర్శనీయము. శ్రీశాస్త్రిగారి వ్యాస మున ఖగోళశాస్త్రమునకు సంబంధించిన సాంకేతికత్వము సమంజసమై వారి శాస్త్రీయ దృక్పథమును వెల్లడించు చున్నది. భూదేవి నరకుని తల్లి. నరకుని తల నేల కొరిగిన తరువాతనామె స్వామిని స్తుతించిన తెఱంగామె నిశ్చల హృద యత్వమును క్షమాత్వమును అద్భుతముగా ప్రదర్శించు చున్నది. నరకుడు త్వష్టకు నుదాహరకు పుత్రియైన చతుర్ద శిని వలచినాడు. అతడు చతుర్దశినాడే స్వామి చేతులలో పతనము చెందినాడు. అది సర్వమానవాళికిని దీపావళియై నది. దుష్ట సంహారము లోకానంద కరమగుట సహజమే.

భాగవత కృష్ణుడను వ్యాసమాలోచనా స్ఫోరక మైనది. శ్రీకృష్ణుని బాల్యలీలలవలెనే భగవత్త్వము

కూడ భాగవతమున ప్రతిపాదింప బడినది. భీష్ముని దొట్టి అక్రూరాదుల వఱకు నందఱు నతని భక్తిసాగరమున నోలలాడిన వారే. అతని స్మరణము సంసారపయోనిధి తరణము. అతనియందు దివ్యమానుష శక్తుల సమ్మేళనము గోచరించును. శ్రీ శాస్త్రిగారు చెప్పినట్లు గోపికా కృష్ణుల సాహచర్యమొక భక్త్యుపనిషత్తు. స్వామి పరిగ్రహించిన అష్ట మహిషులు ప్రకృతి శక్తుల ప్రతీకలు. పోతన ఆరంభ పద్యమున చెప్పినట్లు స్వామి లోక రక్షైకారంభకుడు; భక్తపాలన కళా సంరంభకుఁడు; దానవోద్రేక స్తంభకుడు, లీలా సృష్ట బ్రహ్మాండ భాండకుడు. నందాంగనా డింభకుడై అతడు కావించిన లీలలు జగన్మోహనములు. స్వామి చివర ఉద్ధవునికిచ్చిన సందేశము భాగవత కర్త పాఠకులకిచ్చిన దివ్య సందేశము.

పాండురంగ మాహాత్మ్యమున రామకృష్ణుడు రాధాకృష్ణుల వృత్తాంతమును వర్ణించి యున్నాడు. గోలోకవాసినియైన రాధ రాసమండలేశ్వరి. జగన్మాతృ స్వరూపిణి. ఇదియొక దృష్టి. లోకదృష్టిలో ఆమెకును స్వామికిని వివిధములైన సంబంధములున్నవి. స్వామి మాయా మానుష

విగ్రహము ధరింప నతనికి మనః ప్రీతి కలిగించుటకై బ్రహ్మ నిఖిల భువన మోహినియైన శక్తిని నందుని మఱదియగు శత గోపునికి కూతురుగా పుట్టించెను. ఆమె స్వామికై తపస్సు చేసి కృతార్థురాలయ్యెను. కవి ఆమె శక్తి స్వరూపిణియని సూచించినాడు. రామకృష్ణుడు కావించిన రాధ వర్ణన మపూర్వము. ఈ వర్ణననుగూర్చి శ్రీ శాస్త్రిగారు కావించిన వ్యాఖ్యానము వారి తాత్త్విక పరిశీలన పాటవమునకు నిదర్శనము. రాధకును శివునికినిగల అభేదము కొన్ని పురాణములలో వ్యక్తము చేయబడినది. ఇది వైదిక సంప్రదాయ సిద్ధమైనట్టిది. రాధ వర్ణనలో ప్రకృతి, కాలము మొదలైన సర్వాంశములు ఆమె తపస్సునకనుకూలములైనట్లు వర్ణించి రామకృష్ణుడన్యులు ప్రదర్శింపని మహాశిల్పమును ప్రదర్శించినాడు.

ఏలయన హేమంతమున రాధ మొదలిడిన తపస్సు శరత్తులో ఫలించినది. కవి వర్ణనమంతయు కాలానుగుణముగా సాగినది. "ఇంద్ర చాపంబుకాదిది హాళి తలమున సవరించు బర్హిపింఛంబు కాని" వంటి పద్యములు స్వామి రాధకు ప్రకృతి స్వరూపముగా సాక్షాత్కరించె ననుటకు సాక్ష్యములు. ఈ వర్ణన సందర్భమున రామకృష్ణుడు చూపిన ప్రౌఢోక్తి

చాతుర్యము వర్ణనాతీతము. స్వామి రాధ నద్రిజ నేలిన శివుని పోలిక నేలెనని చెప్పుట ఆమెయందు పార్వత్యంశమున్న దని సూచించుచున్నది. స్వామి మాయా శబలితుడగు జీవ పురుషునివలె కృశోదరితో భోగములనుభవించెననుట యందలి ఉపమానమా దంపతుల ప్రకృతి పురుషత్వము నకు సూచన. రామకృష్ణుని రాధయందు శ్రీశాస్త్రి గారన్నట్లు కాలము. ప్రకృతి. తపస్సు. పార్వతి ఐక్యము పొందుట సుందరమైన సత్యము.

శ్రీ ఎక్కిరాలవారు జగద్గురు స్థానము నధిష్ఠించిన మహనీయులు. వారి కావ్యమట్టి ఉన్నత పదవి నందిన మనీషి రచించినట్లే యున్నది. గోద కాళ్వారులలో సత్యోత్తమ స్థాన మున్నది. గోపికలు. రాధ మున్నగువారివలె నామె మధుర భక్తితో స్వామి నారాధించి ఆయన యందైక్యము పొంది ంది. కావ్యమున గోదా వైభవ నిరూపణమే పరమార్థము. స్వామి తన్ననన్య భక్తితో నారాధించుచున్నగోదకు క్రమ క్రమముగానెట్లు సన్నిహితుడయ్యెనో కథలో వర్ణింప బడినది. థా కథన కౌశలముతో పాటిందు భావవిన్యాసము కూడ పరిణతిని పొందినది. గోదా దేవి సత్యా భూదేవుల మాఱట రూపమని కృష్ణరాయలాముక్తమున చెప్పియున్నాడు. సాధారణముగా సత్యకు స్వామి

తన వాడైయై యుండవలెనను స్వార్థముండును. గోదా
రూపమునందిన ఆమెలో ఆ మమతాబంధము సడలి పోయి
నది. హేమ గోదతో నీవే సత్యవన్నప్పుడామె యన్న పలు
కులు పఠితలరోమాళ్ళ పులకరింపజేయును. గోద ఆత్మ నివే
దనము సమగ్రమగుటచే స్వామి నీవు నాదానవని ఆమెకు
వాగ్దానమొసంగి ఆమెను తన రాణిగా చేసికొనెను. స్వామి
ఆమెను తన దానినిగా చేసికొనుటకు ముందిచ్చిన సందేశము
సర్వ పరమార్థ సారము. యాత్రా కల్యాణముల అనంతరము
స్వామి తత్త్వము నావిష్కరించినాడు. శ్రీ శాస్త్రి గారు
గురువుగారి కథా కథన పాత్రచిత్రణ భావ విన్యాస కవితా కా
శలములను వర్ణించినతీరు శిష్యత్వమునించుక సేవ మఱచి
సద్విమర్శకులుగా చెప్పినట్లున్నవి. వివాహ సమయమున
సప్తర్షి పత్నులును నారదుడును అన్న వాక్కులు పరబ్రహ్మ
తత్త్వమును కవితా మయముగా వివరించుచున్నది. చివరి
ఘట్టమున స్వామి తాను పది పాత్రలభినయించు నేక నాయ
కుడనని చెప్పుట దశావతారములు దాల్చినను 'ఏక మేవాద్వి
తీయం బ్రహ్మ' యనబడు "ఏకం స" త్తను పరమార్థమును
వ్యక్తీకరించు చున్నది. సర్వదర్శన సారమైన గురువుగారి
కావ్యమును చదువునప్పుడు - కాదు పారాయణము చేయు
నప్పుడు - తమకేకాదు పఠితల కందఱికిని కలుగు నానందాను
భూతి శ్రీ శాస్త్రిగారిందు చక్కగా నావిష్కరించియున్నారు
వారి వ్యాసము చదివిన తరువాత "అయోధ్య ఎన్నో కావ

ములు చదివిన నేనీ కావ్యమును చదువలేక పోయితినే అని వంతనొందితిని. దానిని త్వరలోనే తీర్చుకొందును.

శ్రీ శాస్త్రిగారు కృష్ణతత్త్వమునంత నవలోడించి దాని కక్షర రూపమునిచ్చి డాక్టరైనవారు. వారే విషయము నైనను చాల లోతుగా పరిశీలింతురు. ఆ పరిశీలనము చివరికి తత్త్వ గర్భముగా పరిణమించును. ఇదివారి అంతర పరిణతికి తార్కాణము; వారి పూర్వ జనుస్సంస్కారము చాలగొప్పది. ఈ సంస్కారమొందరికో యుండదు. "ధన్యాః కతిచన" దానికి నోచుకొందురు. ఇంక వారి శైలియెంత సరళమో అంత భావ నిర్భరము; వాక్యములెంత చిన్నవో విషయమంత మిన్న; పరిశీలనమెంతనిశితమో ఫలమంత రసమయము. వారు నిరుపమధీటుముగా వ్రాయుదురని నేను చెప్పుట హాస్యాస్పదముగా నుండును. వారిని పరోక్షముగా చాల నాళ్ళనుండి యెఱుగుదును. ఇటీవల ప్రత్యక్షముగా నెఱుగు భాగ్యమబ్బినది. వయస్సున చిన్నవారగుటచే ఆ ఆశీర్వంతును; విజ్ఞానమున సామాన్య పరిధుల నతిక్రమించిన మహితాత్ములగుటచే నభినందింతును. వారిట్టి వ్యాసముల నెన్నిటిని వెల్వరించిన సాహితీలోకమున కంత మేలు చేకూరును.

శాస్త్రిగారివంటి సద్విమర్శకవర్యు
లరుదు నేడు - నిక్కమసలులేరు.

10-1-1982
హైదరాబాదు.

దివాకర్ల వేంకటావధాని

# నాట్యావధాన కళ

"ఏవం నాట్య ప్రయోగే బహు బహు విహితం
కర్మ శాస్త్ర ప్రణీతమ్
న ప్రోక్తమ్ యచ్చ్యలోకాదను కృతి కరణం
తచ్చ కార్యం విధిజ్ఞైః"

"ఏవమేతే మయా ప్రోక్తాః
వా గంగాభి నయాః క్రమాత్
నోక్తా యే చమయాతత్ర
లోకాద్గ్రాహ్యాస్తుతే బుధైః."

చిన్న తనంలో పెద్దలెవరో చెప్పగావిన్న ఈ శ్లోకాలు నా దృష్టిని ఆకర్షించాయి. నాట్యస్వరూపాలను కూలంకషంగా చర్చించి స్వరూప నిర్దేశంచేసిన భరత మహర్షి ఇంకా క్రొత్త

స్వరూపాలను సృజించడానికి అవకాశం ఉన్నదని దాదాపు ప్రతి అధ్యాయం చివర చెప్పడం ఆయన మహర్షిత్వానికి నిదర్శనం. కళకి, కళద్వారా చేరదగిన శిఖరాలకీ అంతు లేదు. ఆ విషయాన్ని గుర్తించడం మహర్షికే సాధ్యం. అప్పటికే నాటక రంగంలోనూ, సాహిత్య రంగంలోనూ తప్పటడుగులు వేస్తున్నాను ఏదైనా ఒక నూతన నాట్య ప్రయోగ వైఖరిని ప్రారంభించాలనే తపన బయలుదేరింది. ఆ నాటికి మన రాష్ట్రంలో బాగా ప్రచలిత మౌతున్న సాహిత్యావధాన ప్రక్రియలను పదే పదే చూడడం కూడా దీనికి దోహదం చేసింది. అటు నాట్యకళలోని అంశాలనూ ఇటు అవధాన ప్రక్రియలోని సద్యోవిన్యాస వైఖరినీ మేళవించి ఒక నాటకీయ సృష్టిని చేయ వచ్చునన్న ఊహానాలో మెఱుపులాగా ఓనాడు భాసించింది. అంతే. దాన్ని అంకించుకొని పూర్వాపరాలు పోగువేసుకొని సామగ్రీ సాధనా సమకూర్చుకొని ఓనాడు 52లో నలుగురు మిత్రుల్ని పిలిచి ఈ కళకి నాందీ వాక్యం పలికాను. అంటే పాతికేళ్ళ కిందట. మొన్ననే రజతోత్సవం చేసుకొన్న ఈకళకి లక్ష్యము, లక్షణము నేనే కనుక ఈప్రస్తావనలో నేను మరుగున ఉండి సాధ్యమైనంత తాటస్థ్యంతో పూర్వాపరాలు వివరిస్తాను.

అవధానాన్నిదండి చిత్తము యొక్క ఏకాగ్రత అని నిర్వచించాడు. ఏ విషయంమీద మన చిత్తాన్ని ఏకాగ్రం చేస్తామో దానికి సంబంధించిన అవధానుల మౌతాము. వేదం మీదయితే స్వరావధానులం. ఎనిమిది సాహిత్యాంశాలయితే అష్టావధానులం. నూరు సమస్యా పూరణాలయితే శతావధానులం. వేయి అయితే సహస్రావ ధానులం. నేత్రసంజ్ఞలతో వాక్యాలను ప్రసారంచేస్తే నేత్రావధానులం. చిత్తైకాగ్రత అవధానమైనా మూర్తిలో ఆ పదానికి సద్యోవిన్యాసం కూడా జోడింప బడ్డది. నాట్యంలో అంగికాహార్య సాత్త్వికవాచికాభినయాలు భాగాలు. ఈ నాట్యం అప్పటికప్పుడు సృష్టించి ప్రదర్శిస్తే? అన్న ఊహ ఈ మేడకు పునాది. "అవస్థానుకృతిర్ నాట్యమ్" అన్నాడు ధనంజయుడు. ఒక మానసికావస్థకు తగినట్లు అవయవాల కదలికను ఆంగికాభి నయమని, వేషధారణను ఆహార్యాభినయమని, సంభాషణల, లయాత్మక రచనల సముచితోచ్చారణను వాచికాభినయమని, చర్వణయోగ్యమైన భావానికి సంబంధించిన శారీరక చిహ్నాల ఆవిష్కరణకు సాత్త్వికాభినయ మని పేర్లు. ఇవి నృత్యంలో అభినయ ముద్రల ద్వారానూ, నాట్యంలో కావ్యగత భావాల ద్వారానూ ఆవిష్కరింప బడతాయి. ఇవి లేనిదే ఏ నాట్యవిన్యాసము సమగ్రం కాదు. కాని సాధారణంగా చతుర్విధాభి

నయాలు పూర్వాభ్యాస సిద్ధములై ఆవిష్కరింప బడు తుంటవి. కవి వ్రాసిన సంభాషణలు కంఠస్థం చేయడం మొదలు అన్నీ పూర్వాభ్యాస పరిష్కృతాలే. నాట్యావధాన కళలో ఈ నాలుగు సద్యః సృష్టింపబడి ఆవిష్కరింప బడుతవి. కాబట్టి నాట్య భాగాలైనా చతుర్విధాభి నయాలను అవధానంలో ఒక అంశమైన సద్యో విన్యాసము కలిపి ఈకళా స్వరూపానికి నాట్యావధానమని పేరుపెట్టడం జరిగింది.

అన్ని అవధానాలకు వలెనే దీనికి పృచ్ఛకులుంటారు. అంటే ప్రశ్నించేవారు. వీరు ఎలాంటివారై ఉండాలి? అన్నవిషయంలో సాహిత్యావధానాలకు, నాట్యావధానానికి భేదం ఉన్నది. వారికి సాహిత్యక పరిజ్ఞానం చాలు. వీరికి దానితో బాటు నాటక శిల్పము, రసభావ రసవ్యవస్థల పరి జ్ఞానము, రసజ్ఞత, నాటకీయ సన్నివేశాన్ని ఊహించే నైపుణ్య ము, అన్నిటినీ మించి సహృదయత కావాలి. ఇలాంటి పృచ్ఛ కులు ప్రదర్శనకు ఉత్తమశిక్షకు లౌతారు, ఇందులో ఏలక్షణం లోపించినా రక్తికి భక్షకులౌతారు. నాటకీయ సన్నివేశాన్ని సమస్యారూపంలో పృచ్ఛకుడు కాగితంమీద వ్రాసి ఇస్తాడు. అలా ఏ ముగ్గురో నలుగురో వ్రాసి ఇచ్చిన చీటీలను తీసు కొన్న పిమ్మట పాత్రల వయస్సుయొక్క క్రమాన్నిబట్టి ప్రద ర్శనం ఆరంభ మౌతుంది. అన్నిరకాల పాత్రలకు అనువైన

ఆహార్య సామగ్రి సిద్ధం చేసికొని నేపథ్య గృహంలో ఉన్న వేళ ఇలా అందించిన చీటీని పృచ్ఛకొని మొదట రంగు పూసుకుంటూ ముఖంమిద, పిమ్మట వేషం వేసుకొంటూ ఒంటి మీాద, ఆపాత్రను ఆవాహనం చేసికొని మనస్సులో రంగ నిర్వహణ తాలుకు రేఖాచిత్రం గీసు కోవడం జరుగు తుంది. రంగస్థలం మీాదికివచ్చాక సంభాషణలు, వాసికను పైన నటనా ప్రారంభమై క్రమంగా సన్నివేశ గౌరవాన్ని బట్టి నాటకీయ శిల్పనిర్వహణ, రసపోషణ సాధింపబడతాయి. అంటే పృచ్ఛకుడిచ్చిన చీటీలోనుండి ఒక సుపరిష్కృత నాట్య విన్యాసం విచ్చుకొంటుంది. వాఙ్మయ సృష్టి, నాట్యవిన్యాసం ఏకకాలంలో జరిగే ఈపని అసిధారావ్రతం. రస భావవ్యవస్థ ఊహించగల పృచ్ఛకునిచేతి చీటీ అయితే అది రసధారాప్లుతం. స్త్రీపాత్రలు, సమకాలీన ప్రముఖులు తప్ప ఏనిషేధమూ లేదు నాటకీయత తప్ప ఏవిధీ లేదు. సన్నివేశం పౌరాణిక చారిత్రిక, సాంఘికాలతో ఏదైనా కావచ్చు. ఆహార్యాభినయం సూచ్య ప్రాయం. సంగీతము, లయాత్మక రచన యథావసరంగా ఉం టుంది. ఇది స్థూలంగా కళాస్వరూపం.

మొదట ఆంధ్రకేంద్రాలలో నాట్యావధాన కళ రసజ్ఞుల ఆమోదాన్ని చూరగొని క్రమంగా తెలుగు దేశపు

జిల్లాలు దాటి భారతదేశ ప్రధాన కేంద్రాలలో ప్రచలిత
మైనది. మలిదశలో ఈకళమీద ముచ్చట పడి సోదరులు
రాధాకృష్ణమూర్తి, సత్యనారాయణశర్మ, మరికొందరు సహ
మిత్రులు దీనిని అభ్యసించి సహప్రదర్శకులైనారు. పలు
తావుల పెద్దల ఆశీస్సులు, ప్రేక్షకహృదయ స్పందనము, కళా
స్వరూపంపట్ల ఆసక్తి, పత్రికా ప్రశంసలు మొదలైన సంగ
తులు తనచుకొంటే నేటికొక సుపరిష్కృత కళా స్వరూ
పంగా నాట్యావధానం స్థిరపడిందని నాకనిపిస్తుంది. కాని
నేనుగా చెప్పవలసి వచ్చినపుడు ఈ ముచ్చట "అలమతి
విస్తరేణ."

కళా స్వరూపాలకు ధ్యేయం ప్రేక్షకుల రసానందం.
ఈ కళలో ప్రేక్షకులకు రసానంద భాగధేయత్వమే కాక వారి
ప్రమేయంకూడా ఉంటుంది. వారిలోనుండి కొందరు
ప్రాశ్నికులు నాటక ఘట్టాలను అప్పటికప్పుడు సూచించే
సరికి ఏ ఘట్టానికి ఎలాంటి నిర్వహణ, పరిష్కారము లభి
స్తుందా అని ప్రేక్షకులు ఉత్కంఠతో ఎదురు చూస్తారు.
కనుక దేనికది వారిలో మొదట అద్భుత భావోద్దీపనకు, క్రమం
గా రసోద్దీపనకు కారణమవుతుంది. ఇది సామాజిక ప్రమేయ
ఫలితం. పురాణ పురుషులను, చారిత్రిక ప్రముఖులను భావావిష్ట

స్థితిలో ఆవిష్కరించేటప్పుడు నూతన దృక్పథానికి, నవ్య కల్పనా శిల్పానికి అవకాశమున్నది. ఏ సన్నివేశానికాసన్నివేశం జీవిత శకలం కాబట్టి ఆయా పాత్రలు కొత్త ఊపిరితో పొడగట్టి సాహిత్య నాటక ప్రమాణాలు పెంపొందుతవి. దూరప్రాంతాలకి, పొరుగు రాష్ట్రాలకి ఈ కళను ప్రసారం చేస్తున్నప్పుడు అచటి వారి కథలు గాథలు ఊహాలు, అపోహాలు, చదువులు సాములు దర్శించి ప్రదర్శించటంలో కళాకారుడి సాంస్కృతిక పరిధి పెరుగుతూ కలకాలం విద్యార్థిత్వం నిలుస్తుంది.

కళా విన్యాసానికి మూడు కేంద్రాలున్నాయి. స్రష్ట, అతని సృష్టి, సహృదయానుభూతి. స్రష్టగా నా ఆంతర్యంలోని కొన్ని అనుభూతులు వివరించాను. ఈ సృష్టిని క్రోడీకరించి లక్ష్యలక్షణ సమన్వయం చేత స్థిరీకరించి వీలైనంత మంది అంతేవాసులను తీర్చిదిద్దడం నా ప్రణాళిక. ఇది రెండవ కేంద్రం. మూడవ కేంద్రం సహృదయుల ముచ్చట, మురిపెము. వానిని యీ వరకే నా కళ తలమానికలుగా పొంది ఉన్నది అని నేను వినయంతో అనుకుంటాను. ఈ మూడు కేంద్రాల కళాత్రికోణం మధ్య ఒక బిందువున్నది. అది నా అంతరంగము. కళను సాధన చేసి ప్రదర్శించే స్రష్ట

ప్రేక్షకులు పొందే రసానందంలో భాగస్వామికాడు అని విశ్వనాథ పంచాననుని తిరుగులేని సిద్ధాంతము. మరి రసానందానికి కూడా నోచుకోని ఈ సృష్టి కర్తృత్వం ఎందుకు? ఇక్కడ ఒక సంప్రదాయం అనుసంధించు కోవాలి. నటుడు, కవి, గాయకుడు మొదలైన కళాకారులు తమకు చెందని రాగద్వేషాలను తమవిగా భావించి కనీసం చిత్త స్థాయివఱకైనా అనుభవించి తమ కర్మ శేషాన్ని త్వరగా నశింపజేసుకుంటారు. కాబట్టి, జన్మాంతర వాసనా సంస్కార ఫలితమైన దుష్కర్మ నాశనమే ముక్తికి మార్గముకాబట్టి వారు ముక్తిని సులభంగా పొందుతారు- అని సంప్రదాయ రహస్యవేత్తలు చెబుతారు

అలాంటప్పుడు అప్పటికప్పుడు గుండెలోతుల నుండి పొంగి వస్తున్న వాఙ్మయాంతర్గత రసభావ ప్రపంచాన్ని అనుభవిస్తున్న నాట్యావధాన కళా స్రష్టకు ఈ ముక్తిమార్గము మఱెంత సులభ సాధ్యం కావాలి కదా! కాబట్టే దీనిని ఒక సాధనగా, ఒక తపస్సుగా స్వీకరించి నేను పరిశ్రమిస్తున్నాను. బహుశః విద్యలన్నిటికి ఈ అధ్యాత్మ సాధన అనేది కేంద్రంలో ఉన్న బిందువు కావడం వల్లనే స్వామి "అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతామహం" అని ఉంటాడు దీనికి తోడు జటిల మానవతా గాథలను, సమస్యలను ప్రదర్శించేప్పుడు మానవజాతికి అవసరమైన శాశ్వత సత్యాలను,

విశ్వజనీన ప్రమాణాలను రసంలో రంగరించి, శిల్పంలో పొదిపి, పాత్రలో మాటుపెట్టి ప్రేక్షకులకు అందించే అవకాశం కూడ లభిస్తుంది. వీనిని రసవ్యవస్థకు భంగకరం కానంత వరకు స్వీకరించి ప్రసారం చేయడం ఈ నాకళా ప్రస్థానానికి ధ్రువతార.



# నాకు నచ్చిన పారిజాతాపహరణము

ప్రబంధ వాఙ్మయం తొలి వెలుగులలో నందితిమ్మన పారిజాతాపహరణం ఒకటి. పౌరాణిక గాంభీర్యం నుండి ప్రబంధ సౌందర్య చమత్కారాల వైపు కృష్ణపాత్ర తొలి మలుపు తిరిగింది యీ ప్రబంధలోనే పృధ్వీతత్త్వ ప్రతీక యైన నాయిక సత్యభామ స్వరూప స్వభావాలు మహత్తరంగా రూపొంది ఆమెను మాన, క్రోధ చిహ్నంగా నిలిపిన ఘనత యీ ప్రబంధానికే దక్కుతుంది. హరివంశ కథను ప్రబంధాను గుణంగా తీర్చి దిద్దుకొని చక్కని శిల్పాకృతి కల్పించి ఉత్తమ శ్రేణి కథకుడనిపించుకున్నాడు తిమ్మన. ముద్దు పలుకుల ముక్కు తిమ్మన శైలి సౌందర్య. గాంభీర్యాల సమ్మేళనము. వర్ణనా సందర్భాలలో చిత్రకారుని కుంచెకు

కుండ ద్వారకని లోలోతు సౌందర్య సీమలను తిమ్మన సుల భంగా ఆవిష్కరిస్తాడు. ఆయన పాత్రలు సజీవ శిల్ప మూర్తులై సహృదయ హృదయ సీమలలో కలకాలం విహ రిస్తాయి. దివ్యమానుష భావ సంకేతాలైన సత్యాకృష్ణులు ఆధారంగా తిమ్మన చేసిన శృంగార వీర రసపోషణ శిఖరా గ్రాన్నందుకొన్నది. ఇవన్నీ కాక సాధారణంగా ప్రబంధ వాఙ్మయంలో కనిపించని తాత్త్విక ప్రవచనం ఒకటి కృష్ణ పరంగా ఈ ప్రబంధంలో అంతర్లీన భావధారగా సాగి వచ్చింది. ఇన్ని కారణాలచేత ఆంధ్ర ప్రబంధాలలో పారి జాతా పహరణం గౌరవ పురస్కారాలకు అర్హమౌతున్నది.

స్వామి రుక్మిణి కడ ఉండగా నారదుడువచ్చి పారిజాతాన్ని తనకీయగా తాను రుక్మిణికి ఇచ్చానని. తన తప్పును మన్నింపుమని సత్యను వేడికొన్నాడు. స్వామి ఆమెకు మొక్కుట, ఆమె కుపితయై ఒనర్చిన పాదతాడనము మొ॥ సంగతులు తిమ్మన కృష్ణస్వామి దక్షిణ నాయకత్వాన్ని నిరూపించడానికి. కృష్ణరాయలకు శృంగారంలో పై తరగతి పాఠాలు నేర్పడానికి ఉద్దేశించి ఉంటాడు. పారిజాత కుసుమ వృత్తాంతాన్ని తెలిసికొన్న సత్య తపశ్చర్యకు సంక ల్పించి స్వామి అనుమతి కోరడం ఆమె పాత్రకు పొసగని

శాంత సందర్భం కాబట్టి తిమ్మన పరిహరించాడు. తనకు పారిజాత మీయనిచో గదతో ప్రహరిస్తానని దేవేంద్రునికి నారదునిచేత స్వామి సందేశం పంపిన వృత్తాంతం నాయకోత్కర్షను నిలపడానికి తొలగించాడు. అలాగే అదితి కుండలాల వృత్తాంతం స్వామి ధీర లక్షణాపాదకమై ప్రవర్తింపజేశాడు. పారిజాతాన్ని పొందడానికి ముందు స్వామి శివుని గూర్చి తపస్సు చేసిన వృత్తాంతాన్ని వదలివేయడం కథానాయకుని సర్వాతిశయతత్త్వాన్ని మన్నించడం కోసమే. ప్రసన్నుడైన స్వామిని నారదుడు తనకు బ్రహ్మత్వం సిద్ధించి సాలోక్యము ప్రాప్తించాలని ప్రార్థించిన వృత్తాంతాన్ని తొలగించడంవల్ల దేవర్షి ఔన్నత్యం సిద్ధపూర్వమే అని నిరూపించాడు. పుణ్యకవ్రత వృత్తాంతాన్ని విస్తరించాడు. ఇలా ప్రబంధ స్వరూపాన్ని, అలంకారిక సాంప్రదాయాలను, రస పోషణ సౌకర్యాన్ని మనసులో పెట్టుకొని సంస్కృత హరివంశంలో కథను కొత్తమలుపులు త్రిప్పాడు తిమ్మన. కథలో మొదటి భాగం వాచ్యంగా శృంగారమై వీరానికి దారితీయడం. రెండవ భాగం వాచ్యంగా వీరమై శృంగారంలో పర్యవసించడం ఈ రెంటికి సర్వరస స్వరూపుడైన కుహనా గోపాలుడు కేంద్రమై యుండడం యీ ప్రణాళిక లోని రహస్యం. సిద్ధహస్తుడైన కథాశిల్పి తిమ్మన యీ రహస్యాన్ని నిరూపించాడు.

అర్వాచీన ప్రబంధ శైలి శ్లేషాది చమత్కారా లలో నిండిన అలంకృత రచనము అనే అర్థాన్ని పొందినా తొలి ప్రబంధ కర్తలైన తిమ్మన పెద్దనల దృష్టిలో ఇది రస భావానుగుణమై సౌందర్యమయమైన పదబంధ విన్యాసము. అలాంటి సుకుమార సుందర రచనా ధురీణులైన కొలది మంది కవులలో తిమ్మన ఒకడు. ముక్కు తిమ్మనార్య ముద్దు పలుకు తెనుగు దనాన్ని మన్నించే వేళ అరవిరిసిన కుసు మమువలె ఆహ్లాదిని. తిమ్మన ప్రౌఢ సంస్కృత నిర్మాణం కూడ సుకుమారమే. ఇది సుకుమారోపాసనాశాలియైన తిమ్మన వ్యక్తిత్వానికి నిదర్శనం. "తలిరులతోఁ జినుకులు జలజల వడియఁగ దడిసి మెలఁగు చలి కరువలి నున్ప్రోలపమున విరియు పురువపుఁదోలు మొగడల వలపు దెలుపు తోఁటలలోన్" అన్న పుడు. "బాహా సంభృత కాలదండ జనితస్ఫార స్ఫులింగాళికిన్ సాహాయ్యమ్ము ఘటించి కోపరస ఘూర్ణన్నేత్రదీప్తుల్ పయోవాహాంతర్గత వైద్యుత ప్రభల తేవన్ జూప వాహద్విష ద్వ్యాహోత్తంసము నెక్కిపోరి కడరెన్ వైవస్వతుండుద్ధతిన్" అన్నపుడు తెలుగు, సంస్కృతము మనము వింగడించి చెప్పు కొన్నా రెంటిలో మహాకవి మృదూపాలకి నిదర్శనమైన శైలీ సౌకుమార్యం ఇట్టే పట్టిస్తుంది.

చాలా ప్రబంధాలలో గతానుగతికంగా వర్ణనలు చేయడం. అందుకుగాను సందర్భాలు కల్పించడం కద్దు. ఉన్న వర్ణనలు సందర్భోచితాలై రూప కల్పనాశిల్ప విశిష్టాలై సౌందర్య దృష్టిని వ్యక్తం చేయడం తిమ్మన వర్ణనల ప్రత్యేకత. పరమేశ్వరుడు సృజించిన విశ్వంలోని అణువణువున దాగిఉన్న సౌందర్య సీమలను తిమ్మన కొత్తదృష్టితో దర్శించి ప్రదర్శిస్తాడు. "అలవిని మాసినీ తిలకమప్పుడు నేయ అదోప నిక్కవీడిన కచపంక్తిఁ బల్మరు ముడిన్ విడదోపుచుఁ బై చెఱంగు గ్రక్కునఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమ రంకురింపఁ జంకేన నెఱిచూపు చూచి పలికెన్ చలితాధర పల్లవాగ్రయై" అన్న పద్యంలో సత్యభామ స్వరూపం పాఠకుల మనస్సులో చెరగనిముద్ర వేస్తుంది. "అవె దివ్యర్షి నికేతనంబు లనసూయారుంధతీ కర్ణపూర విమృద్ధార్భక కృష్ణసారగతి సంరంభంబు లింద్రద్రుమోద్భవ నానావిధ వల్కలాంచిత బహిర్ద్వార ప్రదేశంబు లాహవనీయాది హుతాశ ధూమ పటలశ్యామీభవత్ప్రాంతముల్" అన్నప్పుడు పాఠకుడు సత్యాకృష్ణులతో బాటు మున్యాశ్రమ విహారానుభూతిని పొందుతాడు. కథావస్తువు పాత్రలైనా పాత్రలలో కొత్త వెలుగును నింపి తిమ్మన ప్రవర్తింపజేశాడు. స్వామి, సత్య, నారదుడు, శచీపురందరులు అను నాలుగు

స్తంభాలనడుమ యీ ఆట రక్తికట్టింది. ఆరి వేరంపు తపసి ప్రియోక్త, సంకల్పము స్వామిది. లౌకిక పారలౌకిక కక్ష్యలో ఇటు పాత్ర చిత్రణ అటు కృష్ణతత్త్వము సాగి వచ్చాయి. కృష్ణ కథలోని ఇంద్రోపేంద్ర సంబంధాలకు యీ కథ ఆకరము. ఇంతలో పొంగి ఇంతలో కుంగే ఇందుృడు ఐంద్రీతత్త్వ ప్రతీక. రుక్మిణి ఇందిరా ప్రతినిధి యైన ప్రకృతి స్వరూపిణి. ఆమెకు అండ స్వామిలాగే కథను 'కృతక వికాస మచ్చువడ' నిర్వహించినది. బాహ్యోద్వేగ పూరితాత్మైన స్వామి సర్వశృంగార విలాసాలకు కేంద్రమైన నాయిక సత్య. చెలులతో సరస గోష్ఠినైనా స్వామి గుణా లనే స్మరించేటంతటి కృష్ణగత భావనైరంతర్యం కలది. కలలోనైనా స్వామి నెడబాయలేని అనురక్త. స్వామి పరాంగనాసక్తిని విని ప్రేటువడ్డ ఉరగాంగనవలె, హుతాశన కీల వలె విజృంభించిన ఉద్విగ్నానురక్తి ఈమె గుణాలు. స్వామి తన కడకు వచ్చినపుడు కళ్ళనీళ్ళ పర్యంతమైన దైన్యం. మ్రొక్కినపుడు — "జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తనర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామ పాదంబునన్ తొలగన్" ద్రోచిన పేరలుక. కుహనా

గోపాలుని విమర్శించి సాధించి తన ప్రానిక నెరవేర్చుకొనిన పట్టుదల మొ॥ భావాలు శృంగార రసాధిదేవతయైన సత్యకు పెట్టని సొమ్ములు. ఇక స్వామి ఆయా భావాలను తనలో లీనం చేసికొన్న జగన్నాటక సూత్రధారి. శిరము వంచి మ్రొక్కినా, నాయకను అనునయించినా ఆయనకే చెల్లినది. సర్వ సృష్టిలోని దక్షిణ నాయక శ్రేణికి ఆయన గురుపీఠము. ఆయన స్నానపానాదులు దివ్యవిభూతి దర్శకములు. దేవలోక యానము. దేవేంద్ర దమనము వీర విభూతులు. లోకమున— "కొండొక నిల్చి యీ వనమునన్ మోదంబుతో నిర్జరీ జనముల్ గొలువగఁ గ్రీడ సల్పి భవదిష్టంబేను గావింతు" అని పారిజాతాపహరణం వాయిద వేసిన స్వామి సత్యనాయికా రూప జీవాత్మరతుఁడు. ప్రతిన చెల్లించిన స్వామి వీర శృంగార నాయకుడు. ఇంద్రు క్షమించిన స్వామి క్షమాగుణ సంపన్నుడు. వ్రత సమా పర్యంతము సత్యకనుసన్నల మెలగిన కృష్ణస్వామి సత్యా విధేయుడైన జగన్నాయకుడు. ఇలా ప్రబంధంలో ప్రతి పాత్రి తిమ్మన పాత్రచిత్రణా శిల్పానికి నిదర్శనాలు.

ఈ కావ్యంలో శృంగార వీరములు ప్రధాన స్థానాన్ని ఆక్రమించాయి. కాని నాయికా నాయకులు

దివ్య మానుష ప్రతీకలు కావడంవల్ల, పుణ్యశ్లోక ప్రతప్రసక్తి వల్ల చరమ ఘట్టాలలో సర్వభావాలు శాంతంలో పర్యవసిస్తాయి. శృంగారాన్ని సాధారణంగా కవులు అయోగ, సంయోగ, వియోగ, సంయోగముల నే నాలుగు దశలలో పోషిస్తారు. కథావస్తువు ఏకదేశ దాక్షిణ్య ఘట్టం కావడం వల్ల నాయికా నాయకులు యీ వఱకే వివాహితులు కావడంవల్ల ఈ నాలుగు దశలు క్రమానుసారంగా పోషించే వీలులేదు. కాబట్టి పటిష్టమైన రసభావ వ్యవస్థను తిమ్మన స్థాపించుకొని చివరి వఱకు నిర్వహించాడు. సత్యభామ శృంగార వన విహారం, అందలి అలికుల కోకిలా రావములు తటస్థోద్దీపన విభావాలు. మానకోధ వివశయైన నాయిక వర్తనము సమస్త రసభావములకు నిలయము. సత్యభామ కోప విలాపములు, కన్గొనల బాష్పవారి చిందుట సాత్త్వికభావములుగ, ఆమె భావ పద్ధతి సంచారిభావ చాలనముగ వ్యాపించింది. నాయికా నాయకుల దైహిక సంయోగానికి దేవలోక దివ్య భవనమున అవకాశమున్నా దానినివదలి సర్వ భావ ప్రపంచాన్ని దైహిక స్పర్శాతీతమైన ఒక మానసిక కక్ష్యలో దర్శించి రమణీయ లీలా విలాసాన్ని ప్రతిపాదించ

డంలో నంది తిమ్మనార్యుని అభిరుచి గమనార్హం. ఇక వీర రసంలో పీనుగు పెంటలు, రక్తపు ఏరులు వర్ణించక పోవడానికి ఒక కారణమున్నది. యుద్ధము దిక్పాలకులకు, స్వామికి జరిగింది. అందరూ దివ్యభావ ప్రతీకలు, దిక్పాలకులు ప్రయోగించిన ఆయుధాలు స్వామిలో లీనమైనవి కాబట్టి స్వామి నవరస ప్రతీక మాత్రమే కాక విశ్వ విరాణ్మూర్తి కూడా ఔతున్నాడు. తత్త్వ మర్మజ్ఞులైన మహాకవులు దివ్య పాత్రల సర్వభావ విలాసాలను శాంతంలో లీనం చేస్తారు అనే పద్ధతికి తిమ్మన రసపోషణ వ్యవస్థ చక్కని ఉదాహరణము.

తిమ్మనార్యుడు ప్రబంధాన్ని రచించినా అవకాశం మేరకు కృష్ణతత్త్వాన్ని ప్రతిపాదించడం కూడ తన ఆదర్శంగా భావించాడు. పౌరాణిక యుగంలో కృష్ణ పాత్ర యోగ భోగ తత్త్వాల సమ్మేళనం. యోగాంశంపై నే కవిత్రయము, పోతనాదులు మొగ్గు చూపారు. కాలానుగుణంగా సమకాలీన చిత్తవృత్తులు కథానాయకునిలో ఆరోపించటం సర్వ వాఙ్మయాలలో కన్పిస్తుంది. కృష్ణపాత్రలో తెలుగు వాఙ్మయం తొలి నాళ్ళలోని యోగ భోగ సమన్వయం క్రమంగా భోగైక నిర్దేశకం కావడం క్రమ పరిణామ ఫలితం. ఈ పరిణామ చరి

త్రిలో తిమ్మన నాయకపాత్ర చిత్రణ ఒక మలుపు. స్వామిని జగన్నాటక సూత్రధారిగా చూపటంతో పాటు కృష్ణావతార వ్యూహంలో ముఖ్యాంశాలన్నింటినీ తిమ్మన ప్రదర్శించాడు. వివిధ నాయికలతో సమాన స్థాయిలో. భిన్నరూపాలలో స్వామి విహరించడం ఆయన సర్వాంతర్యామి తత్త్వానికి ప్రతీక. అలాగే దశావతారస్తుతి. ప్రస్తుతావతార కథనం, అందు ద్వారక వైకుంఠంగా. రుక్మిణి లక్ష్మిగా చెప్పడం మొ॥ అంశాలన్నీ కృష్ణావతార దివ్యస్తుతి ప్రతిపాదకాలు. సత్యభామ స్వామిని నిందాత్మకంగా స్తుతిస్తూ— "గట్టివ చేతలుం బసలుఁ గల్లదనంబులు నీవు పుట్టంగాఁ బుట్టిన వెందులేని పలుపోకల మాయలు నీకు వెన్నతోఁ బెట్టినవో......" అంటుంది. అంటూ స్వామి కార్యదక్షత. మాయాతత్త్వం మొ॥ అంశాల్ని ధ్వనిస్తుంది. వైతాళిక గానంలోను, నారద స్తుతుల్లోను స్వామి విశ్వరూప స్తుతి భక్తి జ్ఞేయమై విలసిల్లింది. దేవమాత అదితి తానొక భక్తురాలై స్వామి దర్శన స్పర్శనాదులచే పులకించి ధ్యాన పరులైన మునులకు సైతం అందని స్వామి తత్త్వాన్ని గానంచేసింది. బ్రహ్మగా సృష్టించి. జనార్దనుడై పోషించి. భర్గుడై లయించే నిసర్గ వినోది స్వామి.—

"యదుతిలక జగత్త్రయీ నిర్మితి ప్రక్రియాకర్మ శేందిందిరోద్భాసి నాభీసరః పద్మ పద్మాసనీ పాదపీఠాకృతి ప్రస్ఫురత్ కౌస్తుభాంకూరితాళీక బాలాతపద్యోత! పద్ద్యోతి తద్ద్యోత రంగిణ్యుదక్షాళి త్రైణాంక భృత్యాంశుల క్లిష్ట వేల్లజ్జటా జాల జాలంధరోడ్యాన మూలాఖ్య బంధత్రయీ బంధ సంధుక్షిత స్పర్శన స్పర్శ నిర్గ్రంథిత గ్రంథి షట్కాంతరోన్నిద్ర కద్రూసుత శ్రీముఖ జ్వాలవల్లీ పరిస్రంస మాణేందు నిష్యంద సర్వాంగ. నిష్పంద యోగీంద్ర హృద్వేదికావాసా!"——

ఈ దండకంలో యోగ స్వామి స్వరూపాన్ని షట్చక్ర భేదనానంతర జ్ఞేయమైన కుండలినీ శక్తిగా అభివర్ణించడం గమనార్హమైన యోగ రహస్యం. తన వజ్రాయుధం స్వామి మీద పనిజేయనపుడు దేవేంద్రుడు — "సొమ్మొన నెద్ది ఏననగ సొమ్ములకెవ్వడం గర్త వీవు నీ సొమ్ములు ప్రపంచంబు" అని స్వామి విభూతిని నిరూపించాడు. దేవతలు ప్రయోగించిన అస్త్రాలన్నీ స్వామి భిన్న తత్త్వాలలో లీనమైనవి. ఆగ్నేయాస్త్రం తేజంలోను. అనిలము ఊర్పున, సౌరము చూడ్కులో, బ్రహ్మము నాభిలో, పాశుపతం నిజార్థతనువున-దీనివల్ల పురుషసూక్త ప్రతిపాదితమైన స్వామి విరాణ్మూర్తి

గమ్య మానమైంది. ఇలా సాగివచ్చింది తిమ్మనార్యుని కృష్ణ తత్త్వ వ్యాఖ్య.

కాబట్టే కథా నిర్మాణంలోను. ముద్దులు మూట గట్టే శైలిలోను. చిరంజీవమైన పాత్ర చిత్రణాలోను. ఉత్తమాభి రుచిగల రసభావ చాలనలోను అభివ్యక్తీకరించి దివ్య నాయక తత్త్వాన్ని వ్యాఖ్యానించడంలోను నంది తిమ్మన పారిజాతాపహరణం ఉత్తమ ప్రబంధమని చెప్పవచ్చు.

0 - 0

# సాహిత్య ప్రయోజనము

మానవుని అంతశ్చేతన ప్రస్థానాల్లో సాహిత్యం శిఖరాగ్ర ప్రాయమని విజ్ఞులందఱూ అంగీకరిస్తారు. ఉత్తమ సంస్కారవంతుడైన మనీషి ఒకానొక అవిష్టమైన స్థితిలో ద్రష్ట అవుతాడు. అంటే దర్శిస్తాడు. దర్శించేటప్పుడు విశ్వ విశ్వాంతర లీనములైన సత్యాలు అతనికి తేజోమయ గోళాలుగా దర్శనమిస్తాయి. ఆదర్శనానుభూతిని సమాధి స్థితిలో చర్వణం చేసికొని ఆనంద మయమైన అనుభూతి విశేషాన్ని పొందుతాడు. ఆ పొందిన ఆనందాన్ని అందఱికీ అందింపాలని, ఆ చూచిన వెలుగులను అందఱికీ పంచాలని చేసే

ప్రయత్నంలోనే సాహిత్య సృష్టిలీనమై ఉన్నది. ఇలా అందించడానికి, పంచడానికి పూనుకొన్నప్పుడు అతనికి ఉప యోగ పడేది నాదబ్రహ్మము యొక్క వ్యక్త స్వరూపమైన వాక్కు. దాని అర్థము. ద్రష్టగా జగద్గోళ రహస్యాలను దర్శించినపుడు బహిర్లోక సీమలనుండి అంతర్లోక యానా లకు, అతనిని నడిపించేది నాదము, చరాచర జగత్తులో వ్యక్త స్వరూపంగా భాసిస్తున్న దృశ్యానికి వెనుకనున్న అక్ష రము. దీనిని బ్రహ్మముగా మహర్షులు దర్శించారు. అంటే అది సమస్త సృష్టికి కేంద్రమైయున్న ఒక అంతరంగిక స్థితి. మరో సంప్రదాయంచేత దీనినే 'పరావాక్కు' అనవచ్చు. ఇది నిరంతరము హృదంతరంలో నిహితమై మ్రోగుతున్న ప్రణవము. ఆ ప్రణవాన్ని గుర్తుపట్టడానికి మనం పెట్టుకొన్న పేరు ఓంకారము. ముందు ప్రస్తావించిన దార్శనికుడు అంత ర్లోక యానంలో ఈ పరావాక్కు మార్గాన వెళ్ళి దానిని దర్శిస్తాడు. ఈ దర్శన స్థితిలో అది పశ్యంతి వాక్కు. తాను ద్రష్టగా దానిని చూస్తాడు. అది తనచేత చూడబడుతుంది. అటుపైన అది మాధ్యమిక స్థితినిపొంది అవ్యక్తమైన భావా నికి వ్యక్త వైఖరిని కూర్చుకొనడానికి సిద్ధమౌతుంది. అలా

సిద్ధమై మనకు అర్థమయ్యే వాక్కుని వైఖరి అని పిలుస్తాం. ఋషితుల్యుడైన కవి ఈ ఆంతరంగిక దర్శనాన్ని పూర్తిచేసి కొని వైఖరీ వాక్కుచేత సాహిత్య సృష్టిచేస్తాడు. వాక్కు చేత నిండింది కాబట్టి వాఙ్మయమని. సరస్వతివలె అంత ర్వ్యాపిని కాబట్టి సారస్వతమని. భావ సహితత్వం కలిగింది కాబట్టి సాహిత్యమని — ఈ మూడు పేర్లతో మనం వైఖరీ వాక్కు యొక్క రమ్య విలాసమైన ఈ అక్షర సృష్టిని నిర్దే శించు కొంటాం. హితమును చెప్పేది కాబట్టి సాహిత్యమని కూడా కొందరు పెద్దలు నిర్వచించారు. ఈ సాహిత్యం దర్శన స్థితిలోను, సృజన స్థితిలోను. మిక్కిలి ఆంతరంగికమైన వ్యాసంగమైనా వినియోగ స్థితికి వచ్చేసరికి అధిక విస్తృతము వినియోగప్రధానము అయిన ఒక స్వరూపాన్ని పొందు తుంది. ఈ స్వరూపాన్ని కావ్య నాటకాది భేదాలచేత మనం నిర్దేశించుకొని. వాని నాస్వాదించి తృప్తిపడతాం. అంటే సాహిత్య వ్యాసంగానికి మూడు కేంద్రాలున్నాయి. మొదటిది సృష్టి కేంద్రం. అంటే కవి ద్రష్టగా, స్రష్టగా కావ్యాన్ని రూపొందించడానికి చేసిన ప్రయత్నభాగం. రెండ వది స్థితి కేంద్రం. అంటే రమ్య విలాసాలతో శబ్దార్థ సహి తమయి సాహిత్యం విరాజిల్లి సహృదయ హృదయ రంజక

పొందుతున్న స్థితి. మూడవది లయ కేంద్రం. అంటే సహృదయుడు కావ్యాన్ని ఆస్వాదించి వాసనా రూపాలైన తన సంస్కారాలను క్షాళనం చేసికొని కావ్య పఠన ఫలితంగా ఒక లోకాతీతమైన ఆనంద స్థితిలో లీనం కావడం. ఇక్కడ లయమనే దానికి, లీనముగుట 'To merge' అనే అర్థం. ఈ మూడు కేంద్రాలను గుర్తించుకొన్నాక మొదట స్రష్టను గూర్చి, తరువాత సహృదయుణ్ణి గూర్చి, తరువాత అతడు పొందే ఆనందాన్ని గూర్చి చెప్పుకోవడంతో సాహిత్య ప్రయోజనానికి సంబంధించిన ప్రాథమిక అనుశీలనం ప్రారంభమౌతుంది. సాహిత్య స్రష్టకు జన్మ జన్మాంతర సంస్కార ఫలితమైన ఒక దార్శనిక శక్తి, దర్శించిన సత్యాలను వాఙ్మయంగా సృష్టించే నేర్పు, అన్నవి రెండు ప్రధాన లక్షణాలు- ఇలాంటి స్రష్ట కావ్యం యొక్క లగువుబిగువులను బాగా అంకించుకొని అదేపనిగా సాధన చేస్తుండాలి. ఈ లక్షణాల్ని పెద్దలు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము అనే పేర్లతో పిలిచారు. ఇక చదివే వాడికి కొన్ని లక్షణాలు ఉన్నవి. అతడు ఎల్లప్పుడు సాహిత్యానుశీలనం చేస్తుండాలి. తదర్థ భావనచేత వాని మనస్సు అనే అద్దం బాగా మెరుగులు తేలాలి. అప్పుడు కవి చెప్పిన ప్రతి భావం మనస్సు అనే అద్దం మీద చక్కగా ముద్రితమై సాహిత్య

ప్రథమ ప్రయోజనమైన రసానందాన్ని అతడు పొందుతాడ
మూడవది లయ కేంద్రము అన్నామే, అక్కడ ఈ ప్రయో
జనం సాక్షాత్తుగా ప్రసక్త మౌతుంది. కావ్యం చదవడా
మొదలు పెట్టిన పాఠకుడు అందులో వున్న భావ ప్రపంచం
న్మయం కావడం ప్రారంభిస్తాడు. అంటే కావ్యగత భావ
చేత తన లౌకిక సంస్కారాలను క్షాళనం చేసికొంటూ
క్రమదశలో వాసికొక్క అనుభూతి విశేషం కలిగి అందు
కరిగిపోతాడు. ఆ అనుభూతికి మన పెద్దలు రసానంద
పేరు పెట్టి దానికి కొన్ని లక్షణాలను ప్రతిపాదించారు.
యోగులు పొందే బ్రహ్మానందం వంటిదే కాని అది కాద
కవికూడ యోగి వంటి వాడే కాని సృజనాత్మక రజోవిల
చేత ద్రష్టస్థానం నుండి స్రష్టగా అవతరిస్తున్నాడు క
భ్రష్ట యోగిట. ఈ ఆనంద స్థితిలో సహృదయుడికి
చర జగత్తుకు చెందిన ఏస్ఫురణా ఉండదు. ఆ అను
తైలధార వలె అవిచ్ఛిన్నంగా ఉంటుంది. ఆ అను
వాక్కునకు మనస్సునకు అతీతము. దాని ఉత్తర ఫలి
ఒక మహత్తరమైన సంస్కారాన్ని పొందుతాడు. ఒ
దంలో మధుమతి భూమిక ఈ ఆనంద స్థితికి ప్రతీకగా

దాయ వేత్తలు చెబుతారు. దాని తాత్పర్యం ఇలా ఉన్నది:
" మధుమతి భూమికను సాక్షాత్కారం చేసికొన్న సాధకుడికి సత్త్వ సిద్ధిని చూచి దేవతలు ఆయాస్థానాల్లో ఆవాహానం చేయుచుంటున్నారు. ఇక్కడ కూర్చోండి. ఇక్కడ విహారిం చండి. ఇక్కడి అనుభవాలన్నీ రమ్యములు. ఇక్కడ లభిం చే రసాయనం జరామృత్యువులను బాధిస్తుంది. వైహా యస యానము. కన్నుల ఎదుట కల్ప వృక్షములు. దివ్యస్రోత స్వినీ లిపున విహారము లభిస్తవి. ఇక్కడ మహర్షులు సిద్ధులు అప్సరాంగనలు చంద్రికిరణాల నుండి. అమృతము నుండీ సముద్ర మధనమందు బయలు వెడలిన దివ్యులు. నీ చెవులు, కన్నులు దివ్యములు. నీ శరీరము వజ్రోపమము. నీ సద్గుణ ముల చేత సంపాదింప బడిన అక్షయము అజరము అయిన అమరానంద స్థానమును, దేవతల కందఱకు ప్రియమైన స్థాన మును నీవు పొందుము. " ఈ రసానంద సిద్ధి మొదటి సాహిత్య ప్రయోజనంగా చెప్పవచ్చు.

ఇది కాక అనేకానేక ప్రయోజనాలను పూర్వాలంకా రలు ప్రతిపాదించారు. కావ్యము విశ్వశ్రేయాన్ని సాధిస్తుంది. అంటే ఉత్తమ సాహిత్య సృష్టివల్ల కవికి, పఠనం వల్ల సహృద

యులకు మలిన భావాలతో కూడిన సంస్కారాలు క్రమంగా నశించి వారు ముక్తాత్ములు కావడానికి అవకాశం ఉంది. కావ్యం వల్ల కవికి యశస్సు, అర్థసాధన, పఠితకు లోక వ్యవహార జ్ఞానము. కావ్యం చేత సత్పదార్థం ప్రతిపాదింప బడి లోకంలోని శివేతర విషయాలు నశించడం. పఠితకు సద్యశ్శక్యాలములో ఆనంద సిద్ధికై తత్ఫలితమైన పరనిర్వృతి లభించడం మొదలైన వన్నీ ఘంటాపథాలైన విషయాలు.

ఉత్తమ సాహిత్యం కొన్ని విలువలని కలిగి ఉంటుంది. పైన చెప్పిన ఆనందసిద్ధి మొదలైన లక్షణాలు కాక ఎల్ల కాలాలలో, ఎల్ల దేశాలలో ఎల్ల జనులకు పనికి వచ్చే కొన్ని శాశ్వత సత్యాలను అది ప్రతి పాదించి పరమాత్మ లక్షణ మైన శాశ్వత ధర్మగోప్తృత్వానికి అది సాక్ష్యంగా నిలబడుతుంది. సృష్ట్యాది నేటి వరకు వివిధ భాషలలో వివిధ రూపాలలో పునః పునః మననం చేయ బడుతూ ఋషి తుల్యులైన దార్శనిక మహా కవుల చేత సృజింప బడిన ఉత్తమ సాహిత్యమంతా ఈ కోవకు చెంది విశ్వ సంస్కృతీ విలాసానికి అద్దం పడుతుంటుంది. కాని జాతి చేతనానికి ప్రతీక కాదగిన ఇలాంటి మహా సృష్టి అన్ని యుగాలలో జరిగిందని, జరుగుతుందని గట్టిగా చెప్ప లేము.

తత్కాలనికి ఒక భావాన్నో. ఉద్యమాన్నో. సాం ఘిక సందర్భాన్నో. కడకు రాజకీయ యనాద న్నో ప్రచలితం చేయడానికి కూడా ఒక రకమైన సాహిత్య విలాసం పుట్టి ప్రయోజనాన్ని నెఱవేర్చుకొని గిట్టుతుంది. ఇలాంటి సాహి త్యాన్ని ఉత్తమ సాహిత్యంలో చేర్చడానికి వీలుకాదని కొంద అంటే ఇదే ఉత్తమ సాహిత్య మనే వారు కొంతఉంటారు. ఇది వివాదాస్పద విషయము. తత్కాల ప్రయోజనం గల సాహిత్యాలలో కూడ కవి శిల్పశక్తి భాసించక పోదు. ఉద్దిష్ట ప్రయోజనాన్ని నెఱవేర్చక పోదు. పరతాత్వాన్ని ముట్టి రస లోకాలను మెట్టి బ్రహ్మానంద సహోదరమైన ఆనందాన్ని కల్పింప జాలని సాహిత్యము వాసిలో తక్కువైనా ఎల్లకాలా లలో రాసిలో ఎక్కువ గానే ఉంటుంది. ఇది ఎలాంటిదంటే ఏ యేటి కా యేడు ధరాగర్భం నుండి సస్యరాశి ఉద్భూతమై జనుల వినియోగానికి అక్కఱకు రావడం లాంటిది. శాశ్వత ధర్మ గోపన శీలమైన శాశ్వత సాహిత్య సృష్టి ఎలాంటి దంటే ప్రతి వర్ష సస్యోదయానికి. తద్వినియోగానికి వెనుక ఉన్న శాశ్వత సృష్టిస్థితిలయ బీజం వంటిది. ఈ రెండు ఒక నాణా నికి రెండంచుల వంటివి. బొమ్మ. బొరుసు అంతే తేడా తాత్పర్యత: సాహిత్యం ఉత్తమ దార్శనిక శ్రేణిలో శాశ్వత

ధర్మ గోపన శీలము. అవర వినియోగ కర్తృత్వం తత్కాల

ప్రయోజనోద్దిష్టము. ఈ రెంటిలో కూడా మానవ జాతి

అనుశీలనం చేసి అభ్యుదయాన్ని సాధించడానికి సాహిత్యం

అనన్య సాధనం.

# నేను చదివిన ఉత్తమ గ్రంథాలు

నేను చదివిన ఉత్తమ గ్రంథాలు ఇద్దరు మహర్షుల యక్షగానాలు. మొదటిది సిద్ధేంద్రయోగి భామాకలాపము. తత్త్వమునకు, రసభావాలకు కేంద్రమైన కృష్ణకథ ఆధారంగా చిరంజీవిని అయిన సత్యభామను తీర్చి దిద్దడంలో సిద్ధేంద్రుల రచనాశిల్పం ఒక్క నందితిమ్మనతో మాత్రమే పోల్చదగినది. ఇందులో కథ చాలా చిన్నది. ఒకనాడు కృష్ణుడు సరస గోష్ఠిలో తామిద్దరిలో ఎవరు చక్కనివారని సత్యభామను ప్రశ్నించాడు. ఆమె అహంకరించి తానే చక్కనిదానన్నది. స్వామి కుపితుడై వెళ్ళిపోయాడు. వియోగాన్ని భరించలేని సత్యభామ ఆయన కోసం వెదికి చెలియైన మాధవిని దూతిగా

పంపింది. రుక్మిణీమందిరంలో ఉన్న స్వామికి మాధవి తన దొరసాని సందేశాన్ని తెలిపింది. ఆయన సత్యదగ్గరకు రాన న్నాడు. ఈ వార్త విని సత్య మూర్ఛపోయింది. ఇది తెలిసి స్వామి రావడం, సత్య మొదట కోపాన్ని ప్రదర్శించి తరువాత మాధవి ఉపదేశం వలన ప్రసన్న కావడం ఈ కేళికలో ముఖ్యాంశాలు.

కథా ప్రారంభంలో సత్యభామ "తాపమార్చుకోనైతిని దయగమాటలాడనైతిని చెప్పినట్లు సేవచేసి చరణముల నొత్తనైతి మోసపోతి నమ్మగారా" అంటుంది. భావోద్విగ్నమైన ఆమెచిత్తవృత్తిని సిద్ధేంద్రులు నిరీక్షణకు ప్రతీకగా, పరమాత్మతో విశ్లేషమునొంది బాధపడు తున్న జీవాత్మకు సంకేతంగా చిత్రించారు. ఈ చిత్రణ లోనే వివిధ భావచ్ఛాయలను ఆరోపించి సమగ్రమైన పాత్రను ఆవిష్కరించారు. మాధవితో తన వృత్తాంతాన్ని చెబుతూ శమంతక మణి సందర్భముగా తన తండ్రి ఉబ్బత్యాన్ని వివరిం సత్య వివేకవతి. పారిజాత కథ చెప్పిన సత్య గర్వితి. స్వాధీ తికగా, కలహాంతరితగా, విరహోత్కంఠితగా, ఈర్ష్యాకషా యితగా- ఇలా ఎన్నోరూపాలలో సత్యభామ కమనీయ, రమ

ణీయ నాయికగ భాసిస్తుంది. ఇది చక్కని ఆలంకారిక శిల్పం. చివరకు భావశబలతకు తట్టుకోలేక " పదపద్మములు తడబడ సాగె పెదవి సారెకునేమొ అదిరేను మాటి మాటికి కొప్పు విడెనె కివింవికపక్కటిల్లెనే. సారెసారెకు పయట జారెనే " అన్నస్థితిక వచ్చింది. కాని స్వామి వచ్చినపుడు ఇప్పుడు సమయము కాదని చెప్పవే అని అహంకారాన్ని ప్రదర్శిం చింది. మాధవి ప్రబోధింపగ "బంగరు పూవులు నిన్ను పూజసేతురా. చెంగల్వ పూల దండలు మెడనిండ వేతురా కూచిపూడి రాబగోపాల జన్మసాఫల్యము చేయరా" అని శరణాగతిచేసి ధన్యమైనది.

పలుకుబడి సోయగము. సమగ్ర రచనా శిల్పము లోకవృత్త మన స్తత్వ పరిజ్ఞానము మొదలైన అనేక లక్ష ణాలు సిద్ధేంద్రుల రచనలో ఉన్నవి. పదకవితలోను. మార్గ చ్ఛంధస్సులోను. శ్లోక రచనలోను సిద్ధేంద్రులు సిద్ధహస్తులు. "కసిగాటు మోవితో కలకంఠిగాలితో పసుపంటిన దుప్పటి వల్లెవాటుతో పొసగని నిద్రతోవచ్చి నాతలకిటనిలిచి యుండగా పొమ్మంటినే" వంటి వలపు పట్టులు వరువాతి పద కర్తలకు మార్గదర్శకాలు.

మొదట సత్యాకృష్ణులు కలసి ఉండడం తత్వతః జీవాత్మ, పరమాత్మల అద్వైత స్థితికి సంకేతం. తరువాత ఆమెలోవచ్చిన సౌందర్యాహంకారం, స్వామిపై మమకారం కలిసిన అజ్ఞానావరణమే ఈ అద్వైత సిద్ధికి అడ్డుగోడ. అటువైన విరహం జీవుని వేదన. ఈ వేదనచేత తప్తమైన జీవాత్మ పరమాత్మతో ఐక్యం చెందేలోపల అహంకార మమకారములను, అసంగత చిత్త విక్షేపాలను విసర్జించాలి. సత్యభామ ఒకటొకటిగా దుకూలాంబరములను, వారపు సొమ్ములను చివరకు తనకు మిగిల్చిన మాంగల్యాన్ని మాధవికి సమర్పించడం ఈ సర్వసంగ పరిత్యాగానికి సంకేతం. స్వామి మాటను జవదాటబోనని మొదట చెప్పడంలో సమర్పణ బుద్ధి కన్పిస్తుంది. జ్ఞానసాధన పథంలో ఎన్నో విఘ్నాలు ఎదురౌతాయి. స్వామి వచ్చినా హృదయ కవాటం మూసివేయడంలాంటి చిత్తవిక్షేపాలు నశించాలంటే ఆధ్యాత్మిక మార్గములో క్రమంగా సోపానా లెక్కించే గురువు కావాలి. ఈ కథలో మాధవి ఆ పని చేస్తుంది. మొదట ఉపదేశంతో, తరువాత సందేహాన్ని వృత్తితో, తుదపైన సన్మార్గోపదేశంతో జీవ బ్రహ్మైక్య కరణము గావ్యవహరించింది. మాధవి

బహిరంగ మాధుర్య తత్త్వాన్ని ప్రదర్శించి తెరమరుగున శుద్ధ బ్రహ్మ తత్త్వాన్ని గోపనంచేసే కృష్ణతత్త్వాన్ని రమ్యంగా బోధిస్తున్న ఈ కేళిక సిద్ధేంద్రులు ఆంధ్రుల కొసగిన రసవత్పేశల మృదు కేళిక. కూచిపూడి నర్తకుల నాట్యవాహిలోని సాగి వచ్చి ఆంధ్ర హృదయాలలో శాశ్వతముగా జీవించిన సత్యభామ ఆంధ్ర సంస్కృతికి సిద్ధేంద్రుల కానుక.

రెండవది లక్షణాన్నిబట్టి యక్షగానమే అయినా నాటకాలీల అనే ప్రత్యేక తాత్త్విక సంప్రదాయం ఈ రచనలో లీనమై ఉన్నది. ఈ విశిష్ట సంప్రదాయానికి ఆంధ్ర సాహిత్యంలో ఇది ఒక్కటే ఉదాహరణ. ఒకనాడు కృష్ణుడు వేణుగానం చేయగా గోపికలు కృష్ణ బ్రహ్మానందా వేశాన్ని పొంది, చక్కగా అలంకరించుకొని, అహంకరించి సౌందర్యంతో మిలమిల లాడుతున్న యమునా నదీతీరానికి వెళ్ళారు. అక్కడ స్వామి సంకల్పం చేతనే కాబోలు ఒక నవరత్న ఖచితమైన నౌక ఉన్నది. యమున సంసార సాగరము. నవరత్నాల నౌక నవద్వారాల దేహం. అది జీవులకు కల్పించే ఆకర్షణ సౌందర్యం. గోపికలంతా నౌకా విహారం చేద్దామనుకున్నారు. అంటే పూర్వజన్మలకు చెందిన ఋషిసంస్కారములను వదిలి అజ్ఞానావరణంలో బద్ధులైనారన్న మాట.

ఈ విహారములో స్వామిని కలుపుకుందామని కొందరు వద్దని కొందరు చర్చించారు. సంసార తరణానికి స్వామి సన్నిధి కావాలా! అక్కరలేదా! అని చర్చించారన్న మాట. స్వామి కల్పించుకొని పురుషుడు లేనిదే తరుణులు సాహసం చేయ రాదని హెచ్చరించి నేను లేనిదే తృణమైనా కదలదని తన పరతత్త్వాన్ని స్ఫురింప చేశాడు. వారు నౌకలో స్వామికి చోటిచ్చారు. అంటే సంసార సాగర తరణానికి స్వామి సన్నిధి అవసరమని సిద్ధాంతరీత్యా అంగీకరించారు. నౌకలో స్వామితో విహారానందాన్ని పొంది త్రిమూర్తులను సహితము కాముకులుగ చిత్రించి తూలనాడే స్థితివరకు అహంకరించారు. వారి అహంకారాన్ని పరిష్కరింప దలచిన స్వామి సంకల్పం మేరకు ఇంద్రుడు తీవ్ర వర్షం కల్పించాడు. గోపికలు యమునను "అల్లకల్లోల మాయెనమ్మ యమునాదేవి మా ఆర్తులెల్ల తీర్పుమాయమ్మ —— ఓ దేవి కృష్ణ దేవుని గట్టు చేర్పవమ్మా" అని ప్రార్థించారు. ఇది ఒక విచిత్ర మన స్తత్త్వం. సర్వ రక్షకుడైన స్వామిని తాము ప్రార్థించి రక్షించడ మేమిటి? జలప్రళయం వచ్చిందని. స్వామి తమ్ము పరీక్షించడానికే ఈ సన్నివేశం కల్పించాడని వారు గ్రహిం

చారు. స్వామి కలుగచేసికొని ఓడ రంధ్రములను మూయ డానికి తమ కంచుకాలనుతీసి ఉంచమన్నాడు. దేహ ప్రతీక మైన నౌకకు చిల్లులు పడడం అంటే ఇంద్రియ శక్తులు విజృంభించడం, కంచుకాలు అడ్డం పెట్టడం అంటే సౌంద ర్యాది లౌకిక వాసనలను కల్పించే దేహాత్మ భ్రాంతిని విస ర్జించడం. వారికి వస్త్రాపహారణం జ్ఞాపకం వచ్చింది. చాలా సేపు గుస గుస లాడుకొని "హఠముసేయ వేళగాదు ఆత్మ హత్యగాని వేరేలేదు" అని నిర్ణయించారు. హఠయోగాది మార్గములు స్వామిని చేరడానికి చాలవని జీవాత్మను పర మాత్మలో లయం చేయడమే మార్గమని వారు గ్రహించారు. స్వామి వాక్యమును వేదంగా భావించి చీరలన్నీ వదలించి నౌకా రంధ్రాలలో ఉంచారు. అవి అదృశ్యమయాయి అంటే ఆవరణలు అనే అంబరాలు దిక్కులలో కలిసిపోగా వారు దిగంబరలయ్యారు. ఇప్పుడు వారి దుఃఖం ఆగలేదు. "కనుల కాటుక నీరు కారగజూచి కాంతుడెంతో ముద్దు కారగ రమణుల పంతమెల్ల జరిగెను త్యాగరాజ నుతుని మదికరి గెను" అహంకార త్యాగంజేసి ముక్త కంఠంతో స్వామిని ప్రార్థించేదయనీయమైన ఈ స్థితిలో వారి హృదయాలలో పూర్వజన్మ సంస్కార రూపమైన భావచ్ఛాయన ఇలా పెల్లు

బికింది. "పెరుగుపాలు భుజియించి తనువుల బెంచినదెల్ల నిందుకా. నిరవధిక సుఖదాయక మావయను నీటనుగల యుటందుకా అత్తమామలతో నీకై మేమెదురాడినదెల్ల ఇందుకా వలచుచు దోలిజన్మ రామునిచే వరములు బడసిన దిందుకా కోటి జన్మములు తపములుచేసి కోరినవెల్ల నిందుకా" ఇలా విలపించి తమకు దారి జూపుమని స్వామికి అనన్య శరణాగతి చేశారు. స్వామి కనులు మూసికొని నన్నుధ్యానించండి అన్నాడు. అలానే చేశారు. వర్షం వెలిసింది. ఓడ ఒడ్డుకు చేరింది. కళ్ళు తెరిచేసరికి కనక వస్త్రాలతో, రమ్య కంచుకాలతో గోపికలు పూర్వస్థితి పొందారు. స్వామిని అర్చించి తరించారు. ఇలా ముగిసింది ఈ "ఆత్మ కథ."

ఆత్మయానంలోని వివిధ దశలను శరణాగతి ఫలితమైన సాయుజ్యాన్ని రమణీయ కృతులతో చిత్రించి కృష్ణ తత్త్వానికి చక్కని మధుర భక్తి సంప్రదాయాను గుణమైన వ్యాఖ్యానం చేసిన త్యాగరాజస్వామి నౌకా చరిత్రం ఆంధ్ర వాఙ్మయంలో అనన్యమైన రసోపనిషత్తు. ఇద్దరు మహాత్ముల ఈ యక్షగానాలు ఆంధ్ర సాహిత్య పూజాపీఠాన్ని కలకాలం అలంకరిస్తవి.

# రాఘవ స్మృతి

ఇప్పుడు మనకు అర్థమయ్యేరీతిలో నాటకరంగం అన్నది 1880 లో తెలుగు దేశంలో అవతరించడం అదే సంవత్సరములో బళ్ళారి రాఘవ జన్మించడం అన్న రెండు సందర్భాలను పురస్కరించుకొని తెలుగు జాతి మహోత్సాహంతో శతవార్షిక జయంతుల సంరంభాన్ని నిర్వహిస్తున్న వేళ నిదానించిచూస్తే జాతి కృతజ్ఞతతో నెమరు వేసికొని అనుసరించదగిన ఆదర్శ శక్తిగా ఆయన వారసత్వమే మిగులుతుంది. దాన్ని పదిల పరచుకోవడం కనీస ధర్మం. అందుకు రాఘవ స్మృతి మనకేదైనా ఉపకరిస్తుందేమో పరిశీలిద్దాం.

రాఘవ సాంప్రదాయ కుటుంబంలో పుట్టి ఉన్నత విద్యాభ్యాసం చేసి న్యాయవాద వృత్తి చేబట్టి తన జీవిత మంతా నాట్యకళా వ్యాప్తికై వినియోగించాడు. ఆ జన్మ సిద్ధమైన ఒక ఉత్తమ సంస్కారం అవిరళ కృషి ఫలితమైన ఒక కళాసిద్ధి ఆయనను వరించాయి. జన్మతః ఆయనకు ప్రపంచ స్థాయిలోనే ఎక్కువమంది నటులకు లేని రూపరేఖలు భావ ప్రకటనా వైశద్యం ఉన్నవి. వానిని ఆధారంగా చేసి కొని ఒక్కొక్క నాట్య శిఖరాన్నే ఆయన అధిరోహించి నటరాజస్వామి సంపూర్ణ ఆశీస్సుకు అర్హుడైనాడు. సాధా రణంగా తామే విర్వజ్ఞులమని భావించడమో లేక భగవం తుడిచ్చిన ప్రతిభా విశేషాలను పంటకు తెచ్చుకోవటంలో అలసులై ఎక్కడో ఆగిపోయి పాతకీర్తి అనే బ్యాంక్ బాలెన్స్ మీద వడ్డీకోసం ప్రయత్నించడమో లేక ఏ పోటీ నాటకం లోనో ఒక వెండి కప్పు దొరకగానే యిక మన ధ్యేయం 'వెండి తెర' అని భావించడమో రివాజుగా ఉన్న ఎక్కువ మంది నటులకు రాఘవ జీవితపుటలు గుణపాఠం నేర్పుతాయి. కళను తపస్సుగా విజ్ఞాన వ్యాప్తికి వాహికగా ఆయనవలె చాలా దశాబ్దాలు శ్రమించి నిరంతర గమన శీలమైన కాల వాహినిలో సుదూర ప్రయాణం చేసి తీర్థంగా మారిపోయిన

ఉదాహరణలు చాలాకొద్ది. అంచేత ఒక ఉత్తమ ధ్యేయా న్ని ఏర్పాటు చేసికొని దానివెస నిరంతర నిర్విరామ నిర్నిద్ర ప్రస్థానం చేయడం ప్రతి కళాకారునికి అవసరం అన్న ఒక్క విషయాన్నైనా మనం గుర్తుంచుకొని పాదల్లో పుడకల్లాగా కాకుండా నిలచి నిలవరించుకొనడం మంచిది. ఒక కొత్త తరం రావలసి ఉందని అందుకు ఆయన అదర్శం కావల్సి ఉందని నేను తరుచు అనుకుంటుంటాను.

తొలి దినాల్లో ఆయన పౌరాణిక నాటకాలంటే ఆటే ఇష్టపడేవారు కాదు. క్రమంగా ఆయన వాటిని ఇష్ట పడటమే కాక చాల అభినవేశంతో అభినయించి కొన్ని పౌరాణిక పాత్రలను క్రొత్త దృక్కోణంలో అవిష్కరించా రట. తన అవగాహనలో వస్తున్న క్రమ పరిణామాన్ని నిస్సందేహంగా అంగీకరించడం వానికి చిత్తశుద్ధితో దోహ దం చేయడం ఉత్తమ పురుషుల లక్షణము. నిజానికి సాం ఘిక పౌరాణికాల భేధం అధిగమించరాని సమస్యకాదు. ఒక కాలంలో సమకాలీనంగా భాసించే కథలు. గాధలు కాల్రకమాన పౌరాణిక స్థాయికి చేరతాయి. (EPIC LEVEL) వాటిలో ఉండే భావధార కాలక్రమాన ఒక విశ్వజనీన

స్థాయిని సంతరించుకొని భావ చాలనం చేయడంలో కవికి, భావ ప్రకటనం చేయడంలో నటునికి, రససిద్ధిని సాధించ డంలో దర్శకునికి ఎంతో సారవంతమైన క్షేత్రాలుగా రూపొం దుతాయి. అవృత్తాంతాలు ప్రసిద్ధం కావడం వల్ల జాతి సంస్కృతిలో భాగాలై జనులకు నరనరాలలో జీర్ణమై యుండడంవల్ల ఉదాత్తమైన నాట్య విన్యాసానికి తత్ఫలిత మైన రససిద్ధికి కారణ భూతాలౌతాయి. గొప్ప స్థాయి నాటక కర్త, నటుడు, దర్శకుడు తమ ప్రతిభా విశేషాలను జాతి చైతన్యానికి బాగా పునరుజ్జీవం చేయడానికి ఎక్కువ అవకాశం ఉన్నది. దీనికి రెండు కారణాలున్నాయి. పురా ప్రసిద్ధ కథలలో సార్వకాలిక, విశ్వజనీన భావా భాండా రం ఉంటుంది. దానిని కాలానుగుణ విన్యాసంచేసి మంచి విషయాలు సాధించవచ్చు. రాఘవకి దరిమిలా యిలాంటి భావమే కలిగిందట. నిత్యజీవితంలో మనచుట్టూ ఉన్న సంఘటనలు నాటకాల చూడడంలో అన్నది ఒక సరదా సమస్యలు పరిష్కారాలు, నిజాలు, ఇజాలు మొదలైన ఈ ప్రపంచం ఎప్పటి కప్పుడు మారుతూంటుంది. సమస్య చచ్చిపోయాక నాటకం చస్తుంది. వీనిలో చాలా శైలికైన భావ ప్రపంచం చాలనం చేయడంవల్ల కవి నట దర్శకులలో

ఎవ్వరికీ ఒక స్థాయి రాదు. ఇలా అనడం చేత సాంఘిక నాట్యరంగం నిష్ప్రయోజనమని భావించరాదు. ప్రతి సంవత్సరమూ ప్రుట్టి మనం అనుభవిస్తున్న పంట వంటిది సాంఘిక నాటకరంగం. క్షేత్రంలో బీజాలు మొలచి ప్రతి సంవత్సరమూ పంట నివ్వడం వంటిది శాశ్వతతత్వం. ప్రసిద్ధ నాటకరంగం. నాణెమున రెండంచుల్లాగా దేనినీ మనం తీసెయ్య లేము ఇంకొక్క రహస్యం కూడా ఉన్నది. కేవలం సాంఘిక నాటకాలకే పరిమితులై కృషి చేసిన వారిలో మహా కవులుగాని, మహా నటులు గాని, మహా దర్శకులు గాని పుట్టినట్లు నేనెఱుగను ప్రసిద్ధ పౌరాణిక చారిత్రిక నాట్యరంగంలో చాల మంది ఉన్నారు. వారు సాంఘిక నాటకరంగం మీద మరింత ఉజ్జ్వలంగా భాసించారు. శాస్త్రీయ సంగీతాన్ని క్షుణ్ణంగా అభ్యసించిన వాడు తేలిక సంగీతాన్ని తేలికగా పాడగలడు. తేలిక సంగీతం తెలిసిన వాడు ఒక ఎత్తు దాటి ఎదగలేడు. కొన్ని కొన్ని ఇజాలు కళారంగంలో దొడ్డి దారిన దూరి నప్పటి నుండి ఈచర్చలు ప్రారంభం అయ్యాయి. ఒక్క రాఘువ విషయమే తీసుకోండి. ఆయనకున మకాలీను లై ఇప్పటికీ జీవించియున్న పెద్దల వలన గాని ఆయనను గూర్చి

అన్ని విషయాలు తెలిసి వ్రాసిన పెద్దల వలన గానీ మనకి ఆయన చారిత్రిక పౌరాణిక పాత్రల అభినయాన్ని గూర్చి ఉద్వేల ప్రశంస వినిపిస్తున్నది గానీ తప్పెవరిది వంటి నాటకాల ను గూర్చి అట్టిస్థాయిలో విశ్లేషణ, ప్రశంస కనుపడదు. రాఘువ చాణుక్యుడి లాగనో హిరణ్యకశిపుడి లాగనో మళ్ళీ చెయ్యాలని ఎవడైనా ఎప్పుడైనా ప్రయత్నం చేయడానికి అవకాశం ఉంది కాని చిన్న పాత్రలలాగ చెయ్యాలని ఎవ్వడూ అనుకోడు. అనుకోనక్కర లేదు కూడా. క్రొత్తదనం పేరి మన నాటక రంగానికి పట్టిన చీడలలో యిది ఒకటి. ఇప్పటి కైన మనం ఈ భేదాన్ని విస్మరించి రాఘువ లాగ రససిద్ధికి సామాజిక పురోభివృద్ధికి పరిశ్రమిస్తే ఆయన వారసత్వానికి అర్హుల మౌతాము. ఇతర దేశాలలో చూడండి ఆయా సాహిత్య సంస్కృతులలో ప్రసిద్ధేతివృత్తాలకు సంబంధించిన పాత్రల అభినయంలో శిక్షితులైన తరువాతనే సమకాలీన ధా నాటకరంగాన్ని వారు సేవిస్తారు. మనకి పులులను మాచిన నక్కల వలె యితర దేశాలనుండి అవాంఛనీయ ద్ధాంతాల దిగుమతి తెలుసు గాని ఇక్కడే పుట్టిన మహా సాహిత్యాని కళ్ళకద్దుకోవడం తెలియదు. పౌరాణిక నాటక

రంగం కాలక్రమాన దిగజారడం యితర కారణాల వల్ల కాని మంచికవులు, నటులు లేక కాదు ఈవిధమైన అధోగతి ఏ రంగం లోను తప్పదు. ఉదాహరణకి ఒకప్పుడు మంచి ఉదాత్తమైన ఆదర్శం చేత ఉత్తేజితములైన నాటకాలు వచ్చిన ఈసాంఘిక నాటకరంగంలోనే ప్రస్తుతం ఎలాంటి పరిణామాలు వచ్చాయో మనం చూస్తున్నాము. చౌకబారు సినిమాల వంటి హీనమైన స్థితిలో సగటు ప్రేక్షకుడి భావసంస్కారాలను రెచ్చగొట్టే ప్రయత్నంలో విరివిగా సాగుతున్నాయి. కాబట్టి కాళిదాసు చెప్పినట్లు పాతదంతా గొప్పదని కానీ, క్రొత్తది పనికి రాదని గాని అనుకొనక రాఘువవంటి పురోగమన శీలం లో మనం పరిశ్రమించాల్సి ఉంది.

రాఘువ గొప్పసంస్కారం కలవాడు. ఆధ్యాత్మిక జిజ్ఞాస కలవాడు. పండిత తారానాథ్ వంటి మహనీయుల సాన్నిహిత్యము కుటుంబ సంస్కారము ఆయనకి చక్కటి లోచూపునిచ్చింది. జీవితమే ఒకనాటకరంగమని నటుడు తన సాధనను మోక్షోన్ముఖంగా సాగించాలని తెలిసికొని ఆ ప్రకారం పురోగమించినవాడు రాఘువ. ఆయనకు కులమత సంప్రదాయల పేరిట మనిషి కట్టుకున్న అడ్డుగోడల మీద

సమ్మతము లేదు. సర్వాంతర్యామియై, సర్వసులభుడై కరుణా
మయుడైన ఒకానొక సత్పురుషుని ఆయన నమ్మినాడు. అందు
చేత నే వేసిన ప్రతి అడుగులో స్థైర్యము. మనోవాక్కాయ
కర్మశుద్ధి ఆయనకి లభించాయి. ప్రతి అనుభవంలోను పాఠం
ఉంటే నేర్చుకున్నాడు. తప్పుంటే దిద్దుకున్నాడు. నాటికీ
నేటికి తెలుగువాడు గర్వంగా చెప్పుకోదగిన హిమాలయ
శృంగము వంటి మహానటకీర్తి సాధించి మహామనీషిగా మన
స్మృతి పథంలో మసలుతున్నాడు. ఇంతకీ చెప్పవచ్చినది
ఆయనలాగ ఆధ్యాత్మిక గురువును ఆశ్రయించడం, సంకీ
ర్తనలు చెయ్యడం ధ్యానసిద్ధిని పొందడం అన్నది ఉత్తమ
సంస్కారానికి దోహదం చేస్తాయి. అన్న విషయం. దీన్ని
అంగీకరించడానికి గట్టి దమ్ము కావాలి. ఆధ్యాత్మిక సంస్కా
రం ఉత్తమత్వానికి దారితీస్తుంది. అని సంసార పక్షంగా
సిద్ధాంతరీత్యా ఎవరైన ఒప్పుకోవచ్చు. మన చుట్టూ దుర
దృష్టవశాత్తూ ఎక్కువ చలామణిలో ఉన్న Inhibitions వదిలేసి
సాధకులు కావడానికి మరింత గట్టిదమ్ము కావాలి. అప్పటికీ
యిప్పటికీ అలాంటి అంతస్సంస్కారం ఉన్నవాళ్ళే శిఖరాగ్రం

చేసుకోగలిగారు. ఈవిషయంలో కూడ రాఘువ జీవితకు మనకి ఒజ్జబంతి.

సాధారణంగా ఉదాత్త కళాకారుడు సాహితీపరుడు యితరరంగాలలో మానవకోటికి ఆదర్శపాత్రియులైన పెద్దలు రెండు ముఖాలు కలిగి ఉంటారు. ఒకటి అంతరంగికం రెండవది బహిరంగం. ఉదాత్త పురుషుల జీవితచరిత్రలు కావ్యాలుగా వ్రాసేవాడూ ఉత్తమ జీవిత పద్ధతుల మీాద ఉపన్యాసాలు దంచే వాడు తమకళావిన్యాసం చేత మానవలోకాన్ని ఉదాత్త భూమికలలో విహరింపచేసే వాళ్ళూ వ్యక్తిగతంగా ఆలక్షణాలు కలిగి ఉండాలని నియమం లేదు. గొప్ప భక్తి కావ్యాలు వ్రాసినవాడు పరమలుచ్చా కావచ్చు. హరిశ్చంద్రుడి పాత్ర వేసి తలపండినవాడు అబద్ధాల పుట్ట కావచ్చు. మహాశిల్పి నీచవర్తనుడు కావచ్చు. కావచ్చు అని అంటున్నానే గానీ అయిఉండాలని నియమమేమీా లేదు. దీన్ని గురించి నిర్దిష్ట సిద్ధాంత లేమీా లేవు. ఎందుకంటే ఒకకళాశక్తి బాహిరిల్లి సమాజానికి కావలసిన ఒక చైతన్యాన్ని ప్రసాదించవలసివచ్చినపుడు సృష్టితగిన వాహికగా ఒక స్రష్టను ఎన్నుకుంటుంది. ఆస్రష్టకిగల వ్యక్తిగత లక్షణాలతో సృష్టికి పని

లేదు. అతడు పూర్వజన్మల సంస్కార ఫలితంగా పరిణామ చక్రంతో ఒకస్థానాన్ని చేసుకొని ఉంటాడు. వానికి ఇతరుల కంటే యిబ్బడి ముబ్బడిగ కొంత అభినివేశం ప్రతిభా సంపత్తి ఏర్పడి ఉంటుంది. దానిచేత ఇతరుల కంటె సులభంగా అతడు కళా విన్యాసం అనే వ్యాపారాన్ని సులభంగా నిర్వహించుతాడు. ఈపనిచేసినందుకు సృష్టి అతనికి కీర్తి, డబ్బు భోగము మొదలైన కూలిడబ్బులను ఇస్తుంది. ఈమొత్తం సంస్కారం అతని అంతరంగిక వ్యవస్థలో ఒకభాగం కానక్కరలేదు అన్నవిషయం చెప్పడానికి ఇంత దూరం వ్రాశాను. కానక్కరలేదు అనడానికి ఒక్కొకప్పుడు కావచ్చును అనడానికి చరిత్రలోచాలాఉదాహారణలు దొరుకుతాయి. నాలుగంకెలజీతం తీసుకుంటూ A.C Buildings లో పనిచేసే గొప్పగొప్పవారు సరదాకోసం విప్లవాలను గూర్చి ఆకలిచావునుగూర్చి అందంగా రచనలు చేస్తారు. పూట మెతుక్కి పెట్టిపుట్టని మహాకవులు రాజగాథల్ని త్రవ్విపోస్తుంటారు. కాని నన్నయలాగ ఆర్ష జీవితము ఆర్షకవిత్వము. తిక్కనలాగ భారత కథతో పాటు పండిన కవిత్వ జీవితము. పోతనలాగ భాగవత సిద్ధిని పొందిన జీవిత కవిత్వాలు ఉన్నవాళ్ళు కూడా ఉన్నారు నా కెందుకో మొదట నుంచి చెప్పన్న శాస్త్రిలలో పండితులై చతుర్దశ

కళలలో సమర్థులైమెలిగే వారికంటె చిత్తశుద్ధి కలిగి ధర్మ బద్ధమైన జీవితం గడిపే వారంటే ఎనలేనిగౌరవము. ఆదృష్టి తో చూస్తే రెండూ కలసిన తావున ఎంత గౌరవిస్తానో చెప్పలేను. రాఘువ నటుడే కాదు నటధర్మవ్యాఖ్యాత ఉదాత్త భూమికల అభినేత మాత్రమే కాదు. ఉదాత్త సంస్కారి. సమాజంలో ఒక మార్పురావాలని పతిత జనుల్ని ఉద్ధరించాలని నాటకాలాడ్డమే కాక ఉపన్యాసాలు చెపఎటమె కాక నిత్యజీవితంలో ఆపని చేసినట్లుగ ఆయన జీవిత కథ మనకు తెలుపుతుంది. ఇలాంటి ఉద్ధరణ కార్యక్రమాలు రాజకీయవేత్తల ఓట్ల బిచ్చానికి, ప్రభుత్వోద్యోగులకి లంచం కంచం మంచం దొరకడానికి ఉపయోగించే ప్రస్తుత కృత్రిమ వాతావరణములో ఉన్నమనికి ఆయన, ఆయన కుటుంబ సభ్యు లు తలపెట్టి నిర్వహించిన దీనజనోద్ధరణ ఫలితంగా వెలిపెట్ట బడ్డారని ఇంట్లో శవాన్ని కదల్చడానికి వాహకులు దొరకడం వారికి సమస్య అయినదని ఎన్నో అసౌకర్యాలకు గురి అయ్యా రని తెలిసినపుడు ఈసేవానిరతిలోని సాంద్రత ఎలాంటిదో అర్థమవుతుంది. ఆచరణ మరుగువడి ప్రచారం ఎక్కువ అవుతున్న ఈరోజుల్లో ఆయన గొప్పదనం మనకి మరింత భాసి స్తుంది. దీనజనుల్ని, రోగి జనుల్ని పతితుల్ని, పండితుల్ని

సమానంగాచూచి సేవాభావంతో హృదయం స్పందించడమే కాక కొన్ని కార్యాలు ఆయన చేబట్టాడు అంటే అది సామాన్యమైన విషయం కాదు. ఒకానొక భ్రష్ట యోగి తన శేష కర్మాన్ని యిలా పూర్తి చేసుకొని వెళ్ళి పోయాడని భావించి నాకళ్ళు చెమ్మగిల్లుతుంటాయి. అంచేత ఆయనకి నిండు మనసుతో ఐమపది చేస్తాను.

యాంత్రికంగా సమాజంలో పురోభివృద్ధి వచ్చే కొద్దీ కొన్ని సౌకర్యాలు ఎక్కువ అవుతాయి దానితో బాటు కొన్ని అసౌకర్యాలు ఏర్పడతాయి. అంచేత సాంకేతిక పరిజ్ఞానం బాగా అభివృద్ధి చెందింది. కొత్త కొత్త కళా వాహికలు ఏర్పడ్డాయి. ప్రపంచ దేశాలమధ్య దూరం బాగా కుదించుకు పోయింది. ప్రయాణసౌకర్యాలు పెరిగాయి. నటుల యితర కళాజీవుల కృషి విశేషాలను ప్రపంచ పర్యాప్తంగా యిట్టే ప్రచలితం చేయడానికి ఉపకరించే Mass-media ఈనాడు మన వేళ్ళ చివరన ఉన్నది. మీట నొక్కితే విశ్వం శృతికలుపుతుంది. కానీ అలా చేయడానికి గల తాహతే లేక చస్తున్నారు. పాపం, ఆరోజుల్లో ఆయనకి యిప్పటి వారికున్నన్ని బిరుదులూ లేవు, యితల

ఇతర సౌకర్యాలూ లేవు. రాజకీయవర్గాది ప్రాబల్యాలు లేవు. కాని ఆంధ్రనాటకరంగ జ్యోతిని విశ్వప్రాంగణములో [illegible] ఎక్కడి [illegible] తన్నుకు అద్దు కునేలాగచేసి ఆకీర్తిని [illegible] పంచి పెట్టాడాయన. బర్నార్డ్ - షా. లారెన్స్ఒలి [illegible] జె. సి. ట్రైవ్. మార్ట్ హార్డెన్ వంటి మహానుభావులు [illegible]ద్వారా ఆంధ్ర నాటకరంగానికి అంజలించారు. అల్లే [illegible]. విశ్వకవి మొదలైన వారంతా ఆయన పాత్రలలో ప్రస్ఫుటమైన అసలు తత్త్వాన్నిచూచి ఆనందించారు. తన కాలములో దేశ విదేశాలలో మకుటమున్న మహానట చక్రవర్తిగా మసలి తాను తరించాడు. మనం కృషిచేయడానికి చక్కని మార్గాలు చూపాడు.

మనకీ నటులు వేలకొలది లేకపోలేదు. కానీ యింతవరకూ ఎవ్వరూ నాట్యరంగాన్ని ఆరాధనా బుద్ధితో సేవిస్తున్నట్లుగానీ. ఒకవేళ సేవిస్తే అంతర్జాతీయ స్థాయిలో చూపదగ్గ ఔన్నత్యస్ఫోరకమైన అభినయ విశేషాలు ఉన్నట్లుగానీ. ఒకవేళ ఉంటే అతడు నాలుగు భాషలలో సమాన స్థాయిగలనటుడై. సుమారు 50 విభిన్న పాత్రలను అనన్యంగా పోషించినట్లుగానీ నాకు తెలియదు. ఒకవేళఎవడైనాకా స్త

ప్రతిభావేశం కలవాడుంటే వాడు యావజ్జీవ విద్యార్థిగచస్తే వుండడు. వుడుతూనే అహంకరిస్తాడు. పోనీ సర్వసమగ్రమైన వ్యక్తిత్వంతో తన జీవితాన్ని కళారంగానికి, సమాజోద్ధరణకి మానవ ప్రగతికి అంకితం చేసిన వాడెవడైనా ఒక 'X' మనమధ్య వున్నాడే అనుకుందాం. వాణ్ణి సమాజంలోకుళ్ళు ప్రభుత్వంలో కుతంత్రం కలసి ఆర్పేస్తాయిగాని బయటికి రానివ్వవు. ఆ రోజులలో తెల్లవాడి దొరతనం కాబట్టి, రాఘవ మేరు గంభీర ధీరుడైన యోగపురుషుడు కాబట్టి, తన ఆశయాల్ని పట్టీ ప్రకారం టిక్ చేసుకుంటూ నెరవేర్చుకొని నిరంతర ఆనంద సీమకు తరలివెళ్ళాడు. ఆయన ముచ్చటపడి ఒక ఉపన్యాసంలో ఉటంకించిన గోరక్ నాథుని సూక్తి ఒకటి ఈ సందర్భంలో జ్ఞాపకం చేసుకుందాం. శుద్ధ జ్ఞానస్వరూపుడైన పరమేశ్వరుడే విశ్వనాటకంలో నటుడు. వివిధ పాత్రధారణం వల్ల మానవత్వానికి అవతరిస్తున్నాడు. అవతరించాక మానవరూపుడే అవుతున్నాడు. మానవుడు బాల్యయౌవన వార్ధకాది దశలుగల మానవజన్మ అనే నాటకం ఆడుతున్నాడే కానీ మరణానంతరం మహానటుడైన శివుడు కాలేకపోతున్నాడు. రాఘవ జ్ఞాపకం చేసిన ఈ భాగాన్ని ఆయనకు అన్వయించినపుడు ఆయన నిజంగా

శిష్యుడే అయ్యావు అని చెప్పవలసి ఉంటుంది. ఏ వ్యక్తికైనా ఇంతకంటే కోరదగింది ఉండదు.

నాట్యరంగం పునరుజ్జీవాన్ని ఉద్దేశించిన రాఘవ తన ఆదర్శ తత్త్వాన్ని జీవితానుభవాన్ని మేళవించి భిన్న సందర్భాలలో కొన్ని సూచనలు చేశారు. సమాజ శ్రేయస్సుకై నాట్యరంగం అంకితమై ప్రేక్షకుల సంస్కారాన్ని అభివృద్ధి పరచాలనీ, ఒక జీవ నాటకరంగం దేశ సంస్కృతికి జీవ నాడిలాగా స్పందిస్తుండాలనీ, నాట్య విద్యా శిక్షణాలయాలు విరివిగ ఏర్పడి ఉత్తమ నటులను రూపొందించాలనీ, ఊరూరా రంగశాలలు నెలకొనాలనీ, నటులు దర్శకులు కవులు నాట్యరంగాన్ని ఒక ఆరాధనాబుద్ధితో సేవించి తీవ్రంగా పరిశ్రమించి సద్రుష్ట విన్యాసం చేయాలనీ...... ఇలాంటివెన్నో ఆయన బంగారుకలలు. వీనిని మనము ఎంత వరకూ నెరవేర్చాము? అన్నది ప్రశ్న. మహనీయుల స్మృతికి మనం చేయగలిగింది వారి ఆదర్శ తత్త్వాన్ని అవగాహన చేసికొని దాన్ని కొనసాగించడమే. అలాంటి కృషి రాఘవ విషయంలో జరుగవలసిఉంది.

# ఎఱ్ఱన వర్ణనా వైశిష్ట్యం

"స్ఫుర దరుణాంశు రాగరుచిఁ బొంపిరి వోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్లను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసర ముఖంబులు శారద వేళఁజూడఁగన్"

అంటూ ఎఱ్ఱన అరణ్య పర్వశేషాన్ని ప్రారంభించాడు. నన్నయ వర్ణించి విడిచిన శారద రాత్రిలలో ప్రకృతి సౌందర్యము సుప్తచైతన్యము వలె దాగి పోగా, నన్నయ కవిత్వధార ఆగిపోగా అరుణ కిరణాల వెలుగున మబ్బులు తొలఁగి హంసలు, బెగ్గురు పిట్టలు, తుమ్మెదలు మ్రోయగా వెలిగిన ప్రాతః కాల శబ్దార్థ చిత్రంలో ఎఱ్ఱన

కవిత్వం సాగివచ్చింది. విశిష్ట వర్ణనాశిల్పంతో కావ్యాన్ని విపుల సౌందర్య సీమగా మలచిన మహాకవులలో ఎఱ్ఱన అనన్యుడు. కథా సన్నివేశానికీ, రసానికీ అనుగుణంగా వర్ణనను తీర్చిదిద్దిన సర్వమార్గేచ్ఛావిధాతృడు.

కంటికి కనబడని పరతత్త్వానికి యీ జగత్తు వ్యక్త రూపం. ఇందులో అందమూ దర్శితకు ఆనందమూ ఉన్నవి. కావ్య జగత్తులో శబ్దార్థ సంబంధము వల్ల గోచరించే అందము లోకసౌందర్యం కంటెలోతుగా, కంటికగపడిన దాని కంటె కమనీయంగా ఉంటుంది. అక్షరాలకు 'వర్ణములు' అని పేరు. ఈ వర్ణాలే రంగులుగాకవి అనేచిత్రకారుడు వేసిన అక్షర చిత్రాలు పాఠకుని మనస్సులో రూపొందుతవి. ఇలాంటి దృశ్య చిత్రణాన్ని శ్రవ్య కావ్యకళలో వర్ణన అంటారు. సిద్ధహస్తుడైన కవి పాఠకునికి మానసిక దృశ్య జగత్తును ప్రసాదించి రససిద్ధిని సులభంగా సాధిస్తాడు. ఎఱ్ఱన అలాంటివాడు.

దుర్యోధనుడు ఘోషయాత్రకి వెళ్ళాడు. అక్కడ అరణ్య సౌందర్యం, గోసమృద్ధి అతన్ని పరవశింపచేశాయి.

"నానా సహస్ర సంఖ్యానంబులై సంతతానంద విగత
భయత్వ లీల

నక్కాన నంబున నేదిక్కుచూచిన నతిసంకులం
బుగఁగుంద శంఖ చంద్రి

హార నీహార డిండీర పటీర ముక్తాహార హీర
సంకాశములును

గాదంబకాలేయ కాదంబినీ నీల జాల తమాలికా
సన్నిభములు

ప్రౌఢ బంధూక పల్లవ భాసితములు వికచకాంచన
చంపక విస్ఫుటములు

నైన వర్ణంబులొప్ప నేత్రాభిరామ భంగి నలరారు
గోకదంబములఁగనియె"

అరణ్యంలో స్వేచ్ఛగా విహరిస్తున్న యీ గోకదంబ వర్ణనము దుర్యోధనునికి నేత్రాభిరామము పాఠకునికి మనో నేత్రాభి రామము. ఉపమానాలుగా వాడిన ప్రతి వస్తువు దివ్యము. శుభము. సంతతానంద విగత భయత్వలీల విహరించే ఆ గోవులకు దుర్యోధనుని రక్షణ అక్కరలేదు. అతడు గోరక్షనెపంగా పాండవ పరాభవం ధ్యేయంగా బయలు

దేరాడు. సుందరవర్ణ చిత్రాల మాటున దుర్యోధనుని యీ దుశ్శీలాన్ని యిట్టే పసుట్టిచ్చాడు మహాకవి.

గంధర్వులచే భంగపడి, ధర్మజునిచే ప్రాణదానం పొంది, తొలుత ప్రాయోపవేశ దీక్షితుడై పిమ్మట పాతాళ యాత్రవలన, కర్ణుని ప్రణయ భాషలవలన ఉత్సాహియై నగ రానికి బయలుదేరాడు ఆ వైభవం ఇలా ఉన్నది.

'రయవిచలత్తురంగమ తరంగములన్ మద నాగనక్రసం
చయములఁ జంచలచ్ఛటుల సైనిక మత్స్యములన్
మహోన్నతం
బయి కురురాజ చంద్రు నుదయంబున దద్దయుఁ బొంగెఁ
బ్రిస్ఫుర
ద్భయద మనోహర ప్రకట భంగులఁ దద్బల వార్ధి
యుద్ధతిన్'

గుఱ్ఱాలు అలలు, ఏనుగులు మొసళ్ళు, సైనికులు చేపలు, సైన్యమే సముద్రము. ఆ సముద్రం కురురాజు అనే చంద్రుని ఉదయం చేత పొంగింది. రూపకాలం కార సిద్ధితో బాటు చలత్సౌందర్య సిద్ధి యీ వర్ణనలో విశేషం

ఇంతవఱకూ ఏ మహాకవియైనా ఊహిస్తాడు. ఈ మొత్తాన్ని భయదమనోహర ప్రకట భంగిగా చెప్పడం ఎఱ్ఱన ప్రత్యేకత. ఆందోళనవీడి ఆశాలోకంలోకి అడుగిడుతున్న కురురాజుకు ఇది మనోహరం. మరిభయం ఎవరికి? ఒక్కుమ్మడిగా బయలుదేరిన యీ సంచలనాన్నిచూచి దద్దరిల్లిన భూచర కోటికి. పరస్పర విరుద్ధ రసభావాలను ప్రక్క ప్రక్కనే నిల్పి నడిపించే వ్యంగ్య భావ వైభవం ఎఱ్ఱన సొమ్ము.

మార్కండేయుడు ధర్మరాజుకి చెప్పిన రామ కథలో రాముడుచూచిన పంపా సరస్సు ఇలా ఉన్నది.

'కమనీయ కమలినీ కహ్లారదళ కేసరాన్విత జలముల
నర్ఘ్య విధియుఁ
దరళ తరంగ హస్తములఁ బాద్యంబు నున్మద చక్రసారస
మధుప హంస
రుతులఁ బ్రియోక్తులు రుచిర వానీర నివేశనచ్ఛాయ ల
విశ్రమంబు
మంద సంచారిత మారుతంబుల నుపతాప నోదనమును
దగిలి యొపుడు

నాచరించుచును సముచితాతిథి జనసేవనమునఁ దనదు
జీవనంబు

ఫలము నొందనొప్పు పంపాసరోవరం బెదురఁగాంచి
రన్నరేంద్ర సుతులు'

అర్ఘ్య పాద్యప్రియ వాగుపచార పురస్సరమైన ఆతిథ్య మర్యాదకు ప్రతిరూపమైన సరస్సును చూడగానే అందమైన యింటికీ యిల్లాలికీ దూరమై అడవులపాలైన అయోధ్యా రాముడు ఆక్రందనం చేశాడు. సరస్సులో ఎంతో సహజంగా అతిథి జనసేవా నిరతిని ఆరోపించడమే కాక దానిని పాత్ర మనస్తత్వానికి అన్వయించి రసభావ చాలనం చేయడం ఉత్తమోత్తమ వర్ణనా శిల్పం. ఎట్టి న యీ ఘట్టంలో తత్తద్విషయ విశేషోల్లాస లగ్నచేతస్కుడై మూర్త వస్తుజాలంలో అమూర్త భావలోకాన్ని దర్శించి ప్రదర్శించాడు.

సీతజాడ కనివచ్చిన హనుమంతుడూ వానర బృందమూ మధువనంలో

'తేనేలు గ్రోలిక్రోలి కడుఁ దియ్యని కమ్మని
పండులింపు సొం

పానఁగనాని యాని పరపందిన నీడలు
మెచ్చి మెచ్చి మం
దానిల శైత్య సౌరభ సమగ్రత కుంగడుఁ
జొక్కి జొక్కియు
ద్యానమునందు మారుతసుత ప్రముఖుల్ విహరించి
తృప్తులై'

ఉన్నారు. తాళ్ళలయ్యాన్వి తగమనంలో స్పందిస్తూ తేట తెనుగు మాటలనీటు దనాలను వెల్లడిస్తూ మారుతసుత ప్రముఖుల స్వేచ్ఛా విహారాన్ని నిరూపిస్తున్న యీ వర్ణన పాత్ర మన స్తత్వానికికూడా అద్దం పడుతున్నది. క్రోలి క్రోలి అని అని వంటి అసమాపక క్రియల ఆవృత్తి మతిమంతుడైన హానుమంతుడు మధువన విహారంచేత ఎంత తృప్తుడైనా రాఘవునికి నమస్కరించి 'దేవి చూడగంటి నేను' అనేదాకా పూర్తి నందని ఆనందానుభూతికి ఉపలక్షకం.

సావిత్రి సత్యవంతులు అరణ్యంలో విహరిస్తున్నారు. "కమనీయ కమలినీ కల్లోల వీధుల గదలు రాయంచల గతుల యొప్పుబహు. పుష్పపల్లవ ప్రకర చిత్రితములై తనరారు

తరులతాతతుల సొంపు, మకరంద రసపాన మదవిహ్వోలంబులై క్రాలెడి యెలదేటి గముల యులివు, బరిపక్వ మంజుల ఫలరసో ద్ధతములై పలుకు రాచిలుకల పటు రవంబు, బ్రియుడు వేలు వేల బ్రీతిమై, జూపుచు, చెప్పుచును జనంగ జిగురుబోడి గనుచు వినుచు నిర్వికార సల్లాప మింపార నతని వెంట నరయుచుండె" సత్యవంతుడు ప్రకృతి సౌందర్యాన్ని చూచి పులకించి సావిత్రికి చెప్పిచూపి ఆనందిస్తున్నాడు. సావిత్రి చూస్తూ వింటూ నిర్వికార సల్లాపంతో అతని పద్ధతి గమనిస్తున్నది. ఆమె ఆ సన్న భర్తృమరణ పరిజ్ఞానంగల సాధకురాలు. ఈవేళకే నిర్వికార విషాదభూమిక నధిరోహించింది. నాయికా నాయకులలో ఒకరిది నిర్వికార చిత్తవృత్తి. ఇంకొకరిది ఆగత విషయ పరిజ్ఞానంలేని ఆనందస్థితి. పై ప్రకృతి సామగ్రిలో ఒకటి నిర్వికార భిత్తికగా, రెండవది స్పందన సీమగా చిత్రించి నాయికా నాయకుల యీ భావభేదాన్ని నిరూపించాడు మహాశిల్పి. కల్లోలినీ రాజ హంసలూ — తరులతలూ పుష్ప పల్లవ ప్రకరాలు-వికసించిన ఘ్రాణాలూ, ఎలదేటిజాలు -మంజులఫలాలు రాచిలుకరవాలు-అనే సామగ్రి లోని జంట లలో ఈ భేదం గమ్యమానమవుతున్నది. ప్రకృతి సౌందర్య

సీమను భావశిల్ప పరసీమగా మార్చడం ప్రబంధ పరమేశ్వరుని వర్ణనావైభవం

ఇలా స్ఫురదరుణాంశు రాగరుచి పొంపిరి పోయిన ఎఱ్ఱన కవిత్వమూర్తి భారతారణ్య పర్వ సీమలలో సుందర దృశ్యాలను చిత్రించి ఆంధ్ర సాహిత్య పీఠంపై అజరామరంగా నిలిచింది.

# పోతన నరకాసుర వధ

ధర్మ సంస్థాపనకు, శృంగార సారస్యానికి, రక్షణ శిక్షణాల వీక్షకు, విభూతికీ, అహంకార మమకారా తీతమైన ధర్మ నిర్వాహణాకు - ఒక్కమాటలో కృష్ణావతార సమగ్ర తత్వానికి అద్దంపట్టే చిన్నకథ పోతనామాత్యుని భాగవతాం తర్గతమైన నరకాసుర వధ. ఐంద్రి శక్తికి ప్రతీకగా నిలిచి అవ సరమైనపుడు తమ్ముడి సహాయాన్ని అర్థించి కానపుడు అహం కరించే ఇంద్రుడు ఈ కథకి బీజాన్నినాటి నరకాసుర వధకి ప్రియోక్త అవుతాడు. మద్ర రాజ కన్యతో పెళ్ళినాటి కాళ్ళ పారాణి ఆరకుండానే చక్రధారియై, దుష్టదమన దీక్షి తుడైన కృష్ణమూర్తి ధర్మవీర శృంగారాల సమ్మేళన కీర్తి, ఎంత కన్నెరుగని ముగ్ధనాయిక సత్యభామ వీర శృంగార రస

మూర్తి. స్వామి చక్రధారచే మస్తకము నేలపై ద్రెళ్ళిన నరకుడు తాను విషాద నాయకుడై విశ్వానికి సంతోషాన్ని పంచిపెట్టాడు. భూదేవి తనకు యజ్ఞ వరాహ రూపంలో స్వామి కటాక్షించిన పుత్రుణ్ణి తన కళ్ళముందు స్వామియే సంహరింపగా కన్నులు చెమ్మగిల్లని క్షమాగుణ సంపత్తితో స్వామి విశ్వరూపాన్ని స్తుతించి నరక పుత్రుడైన భగదత్తునికి రాజ్యం ఇప్పిస్తుంది. ఇలాంటి పాత్రలలో, వారి రసభావ చాలనంతో మహా సాహిత్య శిల్పాన్ని సాధిస్తూనే కృష్ణతత్త్వ నిరూపణలో ఎత్తులను, లోతులను స్పృశిస్తూ తెలుగుల పుణ్యా పేటి పోతనామాత్యుడు నిబంధించిన నరకాసుర వధ ఘట్టం ఎంత రసవంతమో అంత పవిత్రము.

కథా కీలకాన్ని శ్రోత ఇలా ప్రశ్నించాడు. ధరకు ప్రియనందనుడైన నరకుని స్వామి ఎందుకు చంపాడు? ఆ నరకుడు పదారు వేల రాచకన్యలను ఎందుకు చెరలో పెట్టాడు? ఈ రెండు ప్రశ్నలు భావి కథా విస్తరణకు ప్రధాన బీజాలు కాసురుడు అతిసంచయం, అహంకారం, క్రౌర్యం, శౌర్యం కరువున పోసిన అసురమూర్తి. అదితి కర్ణకుండలాలు, వరుణ ఛత్రము, మణి పర్వతము లాంటి దివ్య విభూతి చిహ్నాలను

స్వాయత్తం చేసికొని అహంకరించాడు. అందుకు కారణ
మైన శక్తియుక్తులు అందరు అసురులకు వలనే ఇతనికీ బ్రహ్మ
వర గర్వం వల్ల - అంటే రజో గుణ విలాసం వల్ల - సంక్రి
మించాయి. అతడు ప్రాగ్జ్యోతిషము అనే పురాన్ని నిర్మించు
కొని తనవంటి రాక్షసుల సహాయంతో దానిని గిరిశస్త్ర
సలిల దహన పవన దుర్గమం గను. ప్రచ్ఛన్న మురాసుర పాశ
రక్షితంగాను చేసి కొన్నాడు. ఈ నరకుడు కూడ ఉన్నం
తలో రాక్షసులందరికి వలెనే అయినవేళ, కానివేళ అళ్ళు పెళ్ళు
గా అలంకరించుకొని తిరిగే ఒకరీతి సౌందర్య దృష్టి కలవాడు.
పటిష్ఠమైన రక్షోబృంద సైన్యమే కాక భండనం వచ్చినపుడల్లా
మహోద్దండశుండాదండములైన వేదండములు తండ తండ
ములై నడువగా కదలి వచ్చే ఉద్దండుడు వాడు. ఇంద్రాదు
లను ఇక్కట్లు పెట్టినా, ఊర్వశి ఊసురు పోసుకున్నా, పదారు
వేల రాచకన్నెలను రాచి రంపాన పెట్టినా వానికే చెల్లింది.
ఇంతకీ ఇతడు ఎవరో కాదు. యజ్ఞ వరాహమూర్తి అవతా
రంలో స్వామి కుమారుడు. సంబంధంకూడ సరసమైనదే
చేసి కొన్నాడు. ప్రజాపతిత్వష్టకు ఉదాహారకు పుట్టిన చతుర్ద
శి అనే కన్యను గంధ గజరూపంలో తిసికొని వచ్చాడు. గంధ

గజాలన్నా, గంధగజ యానలన్నా మక్కువ కాబోలు! పాపం
ఆ చతుర్దశినాడే కన్నుమూయవలసి వచ్చింది. ఆయా విషయా
ల్ని పరామర్శించి భౌగోళికులు చక్కని సమన్వయం చేశారు.
నరకుడి పట్టణం ప్రాగ్జ్యోతిషం. అంటే జ్యోతిస్సుకు పూర్వ
మున్న మహాక్షేత్రం. జలప్రళయంలో నుండి భూఖండాన్ని
యజ్ఞ వరాహ మూర్తి పైకి లేవనెత్తేటప్పుడు అందులో
నుండి ఒక పెద్దభాగం ఊడి అంతరిక్ష ప్రదేశాన్ని దాటి అటు
భూమి పరిధికి ఇటు ఇతర గ్రహాల పరిధికి మధ్య నిలిచిందట.
భూమి తన ఆకర్షణ శక్తి చేత ఆ ఉపగ్రహమంత పరిమాణంగల
మట్టి పెళ్ళను తనలోకి తీసికోలేక పోయిందట. దీనిని పరమ
మాగుణ మూర్తియైన భూమాత తన కొడుకునే సరిదిద్దుకో
పోవడంగా పౌరాణికులు దర్శించారు. వరహావతారంలో
ఈ ఉపగ్రహం ద్వాపరాంతం వేళ అంటే సాంప్రదా
క గణనం ప్రకారం దాదాపు 195 కోట్ల సం॥ తరువాత
శంతో సన్నికర్ష పొందడానికి ప్రయత్నించి ప్రకృతిలో
నేక ఉత్పాతాలను కలిగించినది. ఈ ఉత్పాతే నరకాసుర
జృంభణము. స్వామి అంతరిక్ష యానం చేసి ఈ గోళాన్ని
ముక్కలు ముక్కలుగా కొట్టి ఉత్పాతాలను నివారించాడు.

పౌరాణికుడు కథా బీజంలోనే దివ్యవస్తువుల వృత్తాంతం చెప్పడం చేత దివ్య విభూతి కేంద్రాలు అన్యాక్రాంతము లైనపుడు స్వామి వానిని యథాస్థానానికి చేర్చి రక్షించడం అనే బాధ్యతను కూడా నెత్తిన వేసుకొన్నాడు అని స్ఫురింప జేశాడు.

ఈ కథలో సత్యభామ ఒక ముఖ్యపాత్ర. కృష్ణుని ముద్దు ముచ్చటలకు, శృంగార భావాలకు కేంద్రం. స్వామిని "దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ ప్రాపి ణ్యంబులు చూడ గోరుదుగదా! ప్రాణేశ మన్నించి నన్ నీ వెంటం గొనిపొమ్ము--" అనికోరి "కన్య నీవేడ రణరంగ గమనమేడ! వత్తు వేగమ నిలువుము వలదు" అని స్వామి అన్నా పంతం నెగ్గించుకొని వెంటవచ్చిన ప్రాణవల్లభ. నర కాసుర విజృంభణాన్ని చూచి అప్పటికప్పుడు— "వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవి బంధయై భూషణ, శ్రేణిందాల్చి ముఖేందు మండల మరీచీ జాలముల్ పర్వఁగాఁ, బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీర సంరంభయై యేణీ లోచన లేచి నిల్చెఁదన ప్రాణేశాగ్ర భాగంబునన్" ఇలానిలిచి "పరుఁ జూచున్ వరుఁజూచు నొంపనలరింపన్ రోషరాగోదయా

విరత భ్రూకుటి మంద హాసములతో వీరంబు శృంగార
మున్, జరగన్ గన్నులం గెంపుసొంపు బరంగన్ జండాస్త్ర
సందోహమున్. సరసాలోక సమూహమున్ నెఱపుచున్
జంద్రాస్య హేలాగతిన్" యుద్ధం చేసింది వీరనారి. స్వామి
మెచ్చుకున్నాడు. తరువాత అమరావతి కేసికో వెళ్ళి పారిజాతం
తెచ్చి యిచ్చి ముచ్చట తీర్చాడు.

ఇక, స్వామి ఈ కథానాయకునిగా ఏపనీ ఏమరక
వీరశృంగార తత్త్వమూర్తిగా భాసిలి కథని రక్తి కట్టించాడు.
'విలయోద్ధూతాభ్రనిర్ఘాత రేఖా కాఠిన్యము, విముక్త ప్రాణి
చైతన్యము' అయిన పాంచజన్యం పూరించడం మొదలుకొని,
స్వామి వీర విజృంభణము ప్రళయకాల కీలి వలె వ్యాపించింది.
మురాసురుని ప్రచ్ఛన్న పాశాలు త్రెంచి వాని శిరమును ఖం
డించి వాని పుత్రులను సంహరించి యుద్ధానికి వచ్చిన నరకాసు
రునికి ఒక పరమ మనోహర దివ్యదర్శనాన్ని స్వామి ప్రసా
దించాడు. ఇది ప్రాణోత్క్రాంతి వేళ ఎల్లరకూ ధ్యేయము.
బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్రాజ బింబోపరి
స్థల శంపాన్విత మేఘమోయన ఖగేంద్ర స్కంధ పీఠంబుపై
లలనా రత్నముగూడి సంగర కథాలాపంబులం జేయు నుజ్జ్వల

నీలాంగుఁ గన్నిమంగుఁ గుహనా సంగున్ రణాభంగునిన్.' ఈ వర్ణనంచేతనే నరకునికి మోక్షప్రాప్తి ధ్వనించాడు పోతన. సత్యభామ తాకిడికి నోర్వలేక 'దనుజులు మగువల దెస జనరు' అన్న నరకుని అధిక్షేపాన్ని మన్నించి ముందు అతని యోధులను. ఇతర సైన్యాలను గరుడని సాహాయ్యముతో వధించి పిదప 'రుచి మాలాభిన్న ఘోరాసురోత్తమ చక్రం బగు చేతి చక్రమున' వాని మూర్ధాన్ని ఖండించాడు. ఈ ఘట్టంలో భూదేవి కరుణను, నరకుని అసుర సహజమైన ఆక్షేపణను ప్రక్క ప్రక్కనే నిల్పి మహత్తర రసభావ శిల్పాన్ని సాధిస్తూ — "ఇల్లాలిం గీటియైన కాలమున మున్నేనంచు ఘోషింతువో తల్లి! నిన్నుఁదలంచియైన నిచటం దన్నుం గృపన్ గావఁడే చెల్లంబో! తలఁ ద్రెంచె నంచు నిల నాక్షేపించు చందంబునన్ ద్రెళ్ళెం జప్పుడు గాఁగ భూమి సుతుఁడుద్దీప్తాహవ క్షోణిపై" అంటాడు. మహాకవి. భూదేవి కోరికను మన్నించి నరక పుత్రునికి సర్వసంపదలు ఇచ్చి మన్నించడంలో ఆయన భక్తవాత్సల్యము వ్యక్తమౌతుంది. నరకుడు తన ఆధీనంలో ఉంచుకొన్న వ్యవస్థ సమూహాన్ని ఆయా దివ్య స్థానాలకు చేర్చడం. నరకాసుర భాండాగారములోని విభూతిని ద్వారకకు

చేర్చడం జరిగింది. తన సౌందర్య గాంభీర్య చాతుర్యాది గుణ మోహితలైన రాజ కన్యలను బహురూప జీవాత్మలతోడైన స్వామి మన్నించి మున్ను ద్వారకకు చేర్చి అటుపై పారిజాతాపహరణానంతరం వరించి సుఖించాడు. జగదేక శృంగార మూర్తియైన స్వామి ఏ మమతా బంధానికి కట్టువడని స్థితప్రజ్ఞను చూపించి లోకానికి ఆదర్శ ధర్మమూర్తి అయినాడు. లేకపోతే తన పుత్రుని తానే నిర్దయగా చంపి ఉండడు. ధర్మ నిర్వాహణపట్ల స్వపర భేదములేని సనాతన ధర్మ గోప్తగా స్వామి ఇక్కడ దర్శనమిస్తాడు.

ఇవన్నీ ఒక ఎత్తు ఈ మొత్తానికి యుగయుగాలుగా సాక్షీభూతయైన పుడమితల్లి ఒక ఎత్తు. నరకుని శిరము నేలమీద తెళ్ళగానే దివ్య వస్తువులను స్వామికి సమర్పించి ఒడలు మరచి భక్తి భావంతో ఇలా స్తుతించింది — సీ॥ "అంభోజ నాభున కంభోజ నేత్రున కంభోజ నిలయా సమన్వితునకు సంభోజ పదున కనంత శక్తికి వాసుదేవునకును దేవదేవునకును భక్తులు గోరిన భంగినే రూపైనఁ బొందువానికి నాది పురఘునకును నఖిల నిదానమై యాపూర్ణ విజ్ఞానమైన వానికిఁ బరమాత్మునకును. ఆః- "ధాతఁ గన్న మేటి తండ్రికి నజునికి నీకు

వందనంబు సేనొనర్తు నిఖిల భూతరూప! నిరుపమ! యీశ! పరాపరాత్మ మహిత! యమిత చరిత!" ఆయనను సర్వాంతర్యామిగా. త్రిమూర్త్యాత్మక చైతన్యంగా. చరాచర విశ్వమూర్తిగా ధ్యానించి తరించింది. ఏ విధంగాను భావ వైక్లబ్యాన్ని పొందక నిలిచింది. అందుకే ఆమె క్షమ.

ఈ కథకి చిన్న కొసమెరుపు. సంప్రదాయంలో రుక్మిణీ సత్యభామా నీలలు క్రమంగా శ్రీభూనీలా తత్త్వాలకు ప్రతీకలు. అంటే భంగ్యంతరంగా సత్యభామకూడ నరకుని మాతృ స్థానమే. ఆమె ఈసంగ్రామ కేళిలో భాగస్వామిని కావడం పృథ్వీతత్త్వము యొక్క ద్వాపర యుగమూర్తికి గల నిర్లేప దృష్టికి తార్కాణము. కాబట్టే స్వామికి తాను హర్షదాయియై నరకునికి మహాశోకదాయియై సత్యభామ వర్తిల్లింది.

నరకుని పతనం లోకాలకు పర్వదినం. తనకు ముక్తి పథం. ఆ సురశక్తి నావలకు తోసిన యీ చతుర్దశిలాడే నర్వముని. మానవ దేవతాళి గుండెల్లో వెలిగించి దీపావళి.

ఇది స్వామి వీర శృంగార ధర్మ విభూతుల ప్రస్థానం. వసుంధర ఆధ్యాత్మిక ప్రస్థానం. ఇది కవిత్వాన్ని మించిన ఋషిత్వానికి ఆంధ్ర సాహిత్యంలో అద్వైత పోతనా మాత్యులు రచించిన ఆధ్యాత్మికోపనిషత్తు. రసష్రిషం.

: —— :

# భాగవత కృష్ణ

బోసినవ్వుల చిన్నారి బాబును లాలించి జోలపాడే తల్లి తన బాబులో శైశవ కృష్ణ స్వరూపాన్ని చూచి మురుస్తుంది. తరిస్తుంది. అల్లరి పిల్లల అందాలలో బాలకృష్ణ స్వరూపం ఊరు వాడ ఒక కొలిక్కి తెస్తుంది. కోడెప్రాయపు అందగాళ్ళ కోతి కొమ్మంచి ఆటల్లోను. ఉట్లు కొట్టే ఊపుల్లోను కృష్ణస్వామి యువ స్వరూపం భాసిస్తుంది. శృంగార గాథలలో అంతర్లీనమైన తత్వం అంతర్దర్శనం ఉన్నవారిని అలరించి మోక్ష మార్గానికి తరలిస్తుంది. ఈ కథలోని అపూయిత్వాలే అబద్ధమైన కృష్ణ తత్వానికి సామాన్యులను ఆకర్షిస్తాయి. గట్టి రాజకీయపు మడతపేచీ కృష్ణుని రాయబారాన్ని

గుర్తుకు తెస్తుంది. చెంత చేరిన జిజ్ఞాసువులను కటాక్షించి వెన్నుతట్టి ప్రోత్సాహించే గురువులలో గీతాచార్యుడు తొంగి చూస్తాడు. చెఱసాలలో పుట్టి వ్రజ భూమిపై మెట్టి బ్రతుకు మంచితనానికి కానుక నిచ్చి మమకారాహంకారాలు ఆవలకు నెట్టి తుదకు కన్నులముందే స్వజన సంక్షయం జరుగుతున్నా పెదవులమీద చిఱునవ్వు వెన్నెల చెఱుగనీయక తన మరణానికి కారణమైన కిరాతుని క్షమించిన మానవమూర్తి. జీవితమంతా ప్రతి పక్షుల నిందా కుట్ర పీడనము తప్ప ఏమీ ఎరుగని విషాదమూర్తి. ఆ విషాదం మధ్యన బహునాయక జీవాత్మ రతిని బహునాయకా ప్రణయ తత్త్వంలో ప్రతిబింబించిన జగదేక శృంగార మూర్తి. అవతారం చాలించి 5 వేల ఏండ్లపైబడినా సర్వాంతర్యామియై మంద్ర మార్గంలో సర్వుల హృదయాలలో 'సంభవామి యుగే యుగే' అని ముమ్మరిస్తున్న శుద్ధ బ్రహ్మ చైతన్యమూర్తి. ఇలా ఎన్ని మాటలలో వర్ణించుకున్నా తరుగని విభూతిగల విరాణ్మూర్తి కృష్ణస్వామి. నిత్య విభూతి పథంనుండి లీలా విభూతి పథానికి లోక సంగ్రహార్థం అవతరించిన పరతత్త్వం పేరు కృష్ణుడు. ఈ అవతారంలో ఇచ్ఛాక్రియా జ్ఞాన శక్తులు పరాకాష్ఠ స్థితి

నందుకోనడం వల్ల "అంశావతారా అన్యేతు కృష్ణస్తు భగవాన్ స్వయం" అన్నారు పెద్దలు. ఆయన భగవంతుడై దేశ దేశాల. కాల కాలాల భాగవతులకు పరమ పదాన్ని ప్రసాదించే కొంగు బంగారం. అయన లీల మధురం ఆయన పరతత్త్వ విభూతి గంభీరం. లీలా మార్గంలో స్వామి కథ తలంచి స్వామి సన్నిధిని సాక్షాత్కరించు కోవడానికి మానవాళికి అందున "అలసులు మందబుద్ధి యుతులల్పతరాయువులుగ్రి రోగ సంకలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియు చేయజాల రీ కలియుగమందు మానవులు— అని వారికోసం వ్యాస మహర్షి ప్రసాదించిన కల్పతరువు భాగవతం. ఈ జగత్కథకు జగద్గురువు కృష్ణుడే కథానాయకుడు. అతడే భాగవత కృష్ణుడు.

స్వామి బాల్యలీల జగత్కల్యాణ హేల. "ఉరుసంసార పయోనిధి తరణంబులు పాప కుంజ దళనంబులు ముక్తి సమా చరణంబులు బాలకృష్ణ సంస్మరణంబుల్" భాగవత కృష్ణుని బాల్యలీల జగత్సంస్కృతిని తీర్చి దిద్దింది. దివ్య మానుష శక్తులు సమ్మేళనమైన ఈ లోక మోహాన శిశు మూర్తి యాతుధాన సంహారణ చణుడైన వేళ శిష్టరక్షణా

ప్రవణుఁడు. పూతన మొదలు కంసుని వఱకు రకరకాలుగా సంహార కాండ నెఱపినా వానిలో తత్త్వము, మాధుర్య మహత్త్వము మేళవించే ఉన్నాఁడు. ఆకర్షకమైన వేషాన్ని ధరించి సర్వమోహన మూర్తిగా వచ్చిన పూతనను స్వామి గుటుకు గుటుకు మని రెండు గ్రుక్కల పాలతో బాటు ఆమె ప్రాణాలను కూడా త్రాగివేసి పర్యవసానంలో "దేహ కల్మషములు (శ్రీ) హరి ముఖమునఁ ద్రావఁబడుటఁ జేసి —చన్నిచ్చిన సతికి మఱియు జన్మముఁ గలదే" అన్న స్థితికి తీసుకొని పోయాడు. లీలగా మన్నుతిని మందలించిన తల్లికి "అమ్మా మన్నుఁ దినంగ నే శిశువనో" అని ఈ క్రీడా మనుజ బాలకుఁడు జలధి పర్వత వనభూగోళ శిఖి తరణి శశి దిక్పాలాది కరండమైన బ్రహ్మాండాన్ని ప్రదర్శించాడు. తప్పటడుగుల ప్రాయందాటి తన ఈడు పిల్లలతో క్రీడా విలాసాలలో తేలియాడి "ఎన్నడునైన యోగి విభులెవ్వని పాద పరాగ మింతయున్ గన్నులఁగానరట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ బెట్టఁబట్టుచున్ దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బ్రేమ పడికూడియాడుచున్ మన్ననఁ జేయు భాగ్యమును" తనతో చలిది కుడిచే సౌభాగ్యాన్ని వల్లవ కుమారులకు ప్రసాదించాడు. మానవ

జీవితంలో ఉండవలసిన స్నేహ మాధుర్యాలను లోకానికి చాటాడు. పొరుగిళ్ళ పాలు వెన్న మీగడలు దొంగిలి ఎల్లరకు పంచడంలో సంపద ఎవ్వరికీ స్వాయత్తం కారాదని. వ్రజ సౌభాగ్యము సర్వోప భోగ్యమని చాటాడు. మక్కువ పడి వెన్న దొంగిలించడంలో మరో మాధుర్య తత్త్వం ఉన్నది. బహు సంస్కార సాంకర్యంగల భావనా జీవలవారి క్షీరము. ఏకోన్ముఖ సాధనా ప్రతీక దధి. ఆ మార్గంలో నిరంతర తపస్సంజనిత జ్ఞాన శకలము వెన్న. స్వామి దానినే ముచ్చట పడి కోరాడు. ఇంకొక కథ. ఎన్నటికీ జగత్కథ. స్వామి కాళీయ మర్దనం. యమునా నది స్త్రీ స్వరూపం. హ్రదము భగస్థానము. దానిలో చుట్ట చుట్టుకొని ఉన్న కాళీయుడు కామ తత్త్వ ప్రతీక. ఇందులో కుండలినీ రహస్య మున్నది. సన్మార్గంలో సాధకుడు చిచ్ఛక్తి విలాసాన్ని ఆర్జించు కుంటే అది అమృత వర్షిణి. లేకపోతే పాపచుట్ట. ఈ అర్థాన్ని వివరించడానికే పౌరాణికులు పంచేంద్రియ గమ్య మానమైన విజృంభణకు గుర్తుగా కాళీయునికి అయిదు పడగలు కొందఱు. నాడీ మండలానికి గుర్తుగా వేయి పడగలు కొందఱు, నిర్దేశించారు. మొత్తం మీద ఈ కాళీయ ఫణి ఫణా మంటపమున

నళిన లోచన విఖ్యాత నర్తకుడు చేసిన నృత్యము పోతన
గారన్నట్లు సాధకుని నిత్య నైపుణ్యం అవుతుంది. మరొక్క-
శాశ్వత సంకేత లీలా విలాసం వ్రజ గోపికల కథ. స్వామి
పుట్టుక. పెరుగుదల వ్రజ గోపికలకు ముక్తి మార్గమైంది.
వ్రజ గోపికలు పూర్వ జన్మలో తపస్సుచే పండిన మహర్షులు.
స్వామిని గూర్చిన తపము వలన సాక్షాత్స్పర్శచేత తరింపదలచిన
వారు. వీరితో భాగవత కృష్ణుని సాహచర్యము భక్త్యుపని
షత్తు. నారద మహర్షి కూడ భక్తి పారమ్యానికి తన భక్తి
సూత్రాలలో వీరినే ఉదాహరణంగా తీసుకొని 'యథా వ్రజ
గోపికానాం' అంటాడు. స్వామి కన్ను తెరచినప్పటికి నుండి
కన్ను మూసే వరకు గోపికలను ఏమర లేదు. వారూ అంతే.
"ఓయమ్మ నీ కుమారుడు మా ఇళ్ళను పాలు పెరుగు మన
నీడమ్మా" అన్న జగడముతో వీరి కథ ఆరంభమై జీవాత్మ
పరమాత్మ రతి మార్గంలో మోక్ష ప్రస్థానంగా పరిణమించింది.
మొదట చతుర నటమూర్తి గోపాల చక్రవర్తి బ్రహ్మ
గాంధర్వ గీతంతో వారి నాకర్షించి తనవారిని చేసుకొంటాడు.
శరదృతువులలో రాసక్రీడ అనే విశ్వనాట్యాను కరణ క్రీడ
చేత రస సాగరపు లోతులు. భావాంబరపు టంచులు

ప్రదర్శిస్తాడు. హేమంతంలో కాత్యాయనీ వ్రతం చేసి పద్మాక్షుని పతిగా కోరిన గోపికల వస్త్రాపహరణము చేసి వారికి సర్వలౌకిక ధర్మ పరిత్యాగ పూర్వకమైన శరణాగతి తత్త్వాన్ని నేర్పి "మీలోన నెప్పుడు నున్నాఁడ నేను నేను చూపని మర్మ మెద్దికలదు" అని తన సమాగమ సాన్నిధ్యాన్ని ప్రసాదించాడు. స్వామి మధురలో ఉన్నపుడు గోపికలు విరహ భారంతో నవసి పోయారు. రాయబారిగ వచ్చిన ఉద్ధవుని భ్రమర గీతల పేరుతో నింద చేశారు. కాని ధర్మసంస్థాపనకై అంకితమైన స్వామి మళ్ళీ వ్రజానికి రానేలేదు. పళ్ళా పూర్ణంగా గడిచిన ఈ కాలమంతా స్వామి పరోక్ష సన్నిధిలో గోపికలు గొప్ప సాధకు రాండ్రయినారు. ఒకసారి తలలు తలపులు పండిన గోపికలు గ్రహణ స్నానం వేళ స్వామిని కలుసుకొన్నారు. చిఱునవ్వుల చిలిపి కృష్ణుడు ఎట్లో సందు చేసికొని గోపికలను ఏకాంతమునకు తీసికొని పోయి మళ్ళీ మనస్సులోని మమకారాలను కదలించాడు. ఇప్పుడు వారు పండిపోయిన మహాయోగినులు కాబట్టి "ఘోర సంసార సాగరోత్తారణంబు ధీయుత జ్ఞానయోగి హృద్ధ్యేయ వస్తువగుచు నెలుఁగొందు నీచరణాంబుజాత యుగళమును మామనంబుల

దగుల నీవె" అని ప్రార్థించి వరంపొందారు. ఇలా సాగివచ్చిం
ది స్వామి బాల్యలీల.

స్వామి శృంగార కల్యాణలీల ప్రకృతి పురుషుల హేల.
స్వామి అష్టమహిషులను పెళ్లాడిన కథలు ప్రసిద్ధములు.
వారు "భూమిరాపోనలోవాయుఃఖం మనో బుద్ధిరేవచ అహం
కార ఇతీయమ్మే భిన్నా ప్రకృతిరష్టథా" అన్న గీతావాక్య
ప్రమాణాన్ని బట్టి ఆయా ప్రకృతి శక్తుల ప్రతీకలు. వీరికి
పరుడై యున్న పురుషుడు వీరియందు రమించడాన్ని అష్టమహి
షీ కల్యాణ గాథగా మహాత్ములు దర్శించారు. ఇట్లే ఆంగిరస
ములై సామ సాధనకు పనికి వచ్చే షోడశ సహస్ర దైహిక
గ్రంథి కేంద్రాలకు ప్రతీకలుగా షోడశసహస్రసాధిక నారీజన
కల్యాణాలను భాగవతం దర్శించింది. పరమ శుభప్రదమైన
రుక్మిణీ కల్యాణ కథా సూత్రాన్ని (శ్రీ)శుకులు "ఖగనాథుం
డమరేంద్రునిన్ గొలిచి సుధమున్ గైకొన్న చందంబునన్ రమా
భగవత్యంశభవమైన రుక్మిణిని మహార్ణవ మధ్యంబు నుండి
చనుదెంచు ఇందిరా సుందరి వైభవంబున ప్రకాశించిన వేళ
స్వామి వివాహ మాడినాడు. ఇట్లే తదితర నాయికలు కూడా.

స్వామి భక్తులను అనుగ్రహించడం అసలు భాగవత
కథకు కీలకం. చిన్ననాటి మిత్రులైన ఉద్ధవుడు మొదలుకొని

పరమ భాగవతోత్తముడైన భీష్మాచార్యునివఱకు గోపికలు మొదలుకొని కుంతీదేవి వఱకు శ్రీదాముడు మొదలు కుచేలుని వఱకు నరుడు మొదలు నారదుని వరకు అక్రూరుడు మొదలు మైత్రేయుని వరకు స్వామి భక్తానుగ్రహమును చవిఁజూచిన వారలే. మొదట మొదట తన బిడ్డల క్షేమానికై కృష్ణుని బంధుత్వాన్ని పురస్కరించుకొని ఆశ్రయించిన కుంతి పరిపక్వ స్థితిలో నిర్మమము నిరహంకారమూ అయిన స్థితిని పొంది "యాదవులందుఁ బాండవులయందు నధీశ్వర నాకు మోహ విచ్ఛేదము సేయుమయ్య ఘన సింధువు జేరెడి గంగ భంగి నీపాద సరోజ చింతనముపై ననిశంబు మదీయ బుద్ధి యనన్యాదర భక్తితో గదియు నట్లుగఁ జేయఁగదయ్య ఈశ్వరా! అనువఱకు భక్తి ప్రస్థాన మొనర్చినది. స్వామితో మొదట మొదట రాజకీయమున మచ్చరించిన గాంగేయుడు స్వామి సౌందర్యమును పరతత్త్వమును తనివితీర వర్ణించుకొని "మనో వాక్దర్శనముల పరమాత్ముండగు కృష్ణుని హృదయమ్మున నిలుపుకొని నిశ్వాసంబు మాని నిరుపాధికంబైన వాసుదేవ బ్రహ్మంబు" నందు కలిసినాడు. ఈవిధంగా భాగవత కృష్ణుని జీవితకథంతా భక్తానుగ్రహంతో నిండి యున్నది.

ధర్మసంస్థాపనానికి ఆయన చేసిన కృషి ఇంతింతని చెప్ప లేము. తాను సాక్షాత్తుగా అనేకానేక రక్షస్సంహారము చేయ డమే కాక ధర్మ చోదితులై తన్నాశ్రయించిన పాండవుల ద్వారా ఈ కార్యాన్ని నెఱవేర్చాడు. పూతన మొదలుకొని పౌంభకుడి వఱకు స్వామి పరాక్రమానికి ఆహుతియై పరంధా మానికి ఆహూతులైన వారే అసుర శ్రేణి అంతా. ఇది కాక భాగవత కర్త చెప్పినట్లు ఆయన "పాంచాలీ కబరీ వికర్షణ మహా పాపక్షతాయుష్కులన్ చంచద్గర్వుల ధార్తరాష్ట్రుల నని౯ జంపించి గోవిందుఁడిప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకు గల్పించెన్ మహాఖ్యాతిఁ జేయించెన్ మూఁడు తురంగ మేధములు దేవేంద్ర ప్రభావంబునన్."

భాగవత కృష్ణుని ఆరాధనకు అవతార సమాప్తి ఆలయప్రాంగణము వంటిది. స్వామి మొదట తన అనుంగు మిత్రుడైన ఉద్ధవునికి "ఈ జగంబంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱింగి మాయాదుల నాత్మ తత్త్వాధీనంబులుగఁ దెలియుచు జ్ఞాన విజ్ఞాన యుక్తుడవై ఆత్మానుభవ సంతుష్టుండవై విశ్వం బును నన్నుగా భావించి వర్తింప వలయు" అని ఆదేశించాడు. ఈ మహా సందేశమే విదుర మైత్రేయ సంవాదంలో ప్రతి

ఫలించింది. మందిరమార్గంలో మారుమోగి యుగయుగా లలో ఒకసారి కరుణాహింసల మూర్తిగా, మరోసారి త్యాగ వేదనా కీర్తిగా భిన్న నామాలలో మారు మోగింది. సృష్టి కలకాలము మారు మోగుతుంది. బాలకృష్ణుని వేణునాదము మందిర మార్గంలో భాగవత కృష్ణుని భక్తిగానమైంది. గీతా చార్యుని గీతామృతమై ఉపనిషత్తుగా చిన్మదిరపట్టింది. పురా ణేతిహాస కావ్యనాటక వాఙ్మయంగా పరిచలించి సర్వకళలలో స్పందించింది. అన్ని దర్శనాలలో ఆలముకొన్నది. యుగయు గాలకు భాగవత కృష్ణుడు "భక్త్యాత్వనన్యయా శక్య అహ మేవం విధోర్జున జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప" అంటూనే ఉంటాడు.

# రామకృష్ణుని రాధ

మామూలుగా తెనాలి రామకృష్ణుణ్ణి చాల గడుసరి కవి అంటారు. ఒక స్థాయి దాటి మన భావపరిధికి, అవగాహనకు అతీతమైన ప్రతిభ వున్న వాళ్ళందరిని ఇలా అనడం ఆచారం. రచనా శిల్పం దగ్గరికి వచ్చేసరికి ఈ గడుసరి తనము అన్నే దానికి నిర్వచించడము కష్టం. శబ్దార్థ సంవిధానం లోని రామణీయకత మొదలుకొని కావ్యం లోని మహార్థ ధ్వని పర్యంతం వ్యాపించే ఒకానొక అనన్యమైన రచనాకౌశలాన్ని తెలుపడానికి ఈ పదం వాడతాం. ఆయా కవుల స్థాయిని బట్టి శబ్దార్థ సన్నికర్ష, శైలీ మాధుర్యము, జాతీయ పద ప్రయోగము, వర్ణన, అలంకార ప్రయోగము, పాత్రచిత్రణ, నాటకీయత, రసపోషణము— వంటి ఎన్నో విషయాలు వేరువేరుగా చూచి మెచ్చుకోదగినవి ఉంటాయి. కాని భారతీయ అలంకా

రిక దర్శనాన్ని బట్టి ఈ అంశాలన్ని కావ్యంలోని మహార్థ ధ్వనికి ఉన్ముఖంగా ప్రసరించినపుడే అర్థవంతాలవుతవి. అలాంటి అర్థసిద్ధిని సాధించిన వారిని మహాకవులని గౌరవిస్తాము. వీళ్ళకంటే ఎత్తుకి ఎదిగి వేదార్థలను తమ రచనల్లో ధ్వనింప చేసే వారిని దార్శనిక కవులని సంభావిస్తాము. అలాంటివారు ఏ బాషలోనైనా కొద్దిమందే ఉంటారు. వారిలో తెనాలి రామకృష్ణుడు అగ్రగణ్యుడు. శైవ, శాక్తేయ, వైష్ణవ ఆగమసారమైన పాండురంగ సమగ్ర దర్శనాన్ని తెలుగువారికి ప్రసాదించిన మహాద్రష్ట. అంతకుముందుకాని, ఆతరువాత కాని అతని దుర్నిరీక్ష కవిత్వ ప్రస్థానాన్ని అందుకున్న వారే లేరు. ఈస్కాందపురాణనీరనిధి కౌస్తుభ తేజాన్ని ఎన్ని కోణాలలోనో చూడవచ్చు. అందులో తృతీయ, చతుర్థాశ్వాసాలలో వ్యాపించిన రాధాకృష్ణ వృత్తాంత పరిశీలన ప్రస్తుతం.

**రాధాకృష్ణతత్త్వము-ప్రాతిపదిక :** కృష్ణకథలో రాధా కృష్ణతత్త్వం వలె వివాదాస్పదమైనది కానీ, మోహనమైనది కానీ మఱొక అంశము లేదు. భారతీయ సాహిత్యం లోనే ఇది ఒక అపూర్వ దర్శనము. ఆరాధన సంప్రదాయాలను,

చిత్రి సాహిత్యాది కళాస్వరూపాలను ఇది కదలించినంతగా
కదలించలేదు. ఇలా అనడానికి అతి ప్రాచీనమైన శాసన
ఙ్మయమే సాక్ష్యము. పౌరాణికంగా చూస్తే వామన, దేవీ
గవత, మత్స్య, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, పద్మ,
పురాణాదులలో ఇది ఒక ప్రత్యేక దర్శనము. హాలుని
థాసప్తశతి, వరాహమిహిరుని బృహత్సంహిత, ప్రాచీన
ళ పురాణాలు, శిలప్పదికారము వంటి కావ్యాలలోను,
రీతుల వ్యాపించినది ఈ కథ. దీంట్లో రెండు అంశాలు
పిస్తవి .1. సృష్టి కంతటికీ కేంద్రస్థానంలో ఉన్న గోలో
స్వామిని రాధ స్వామికి హ్లాదినీశక్తి, మూలప్రకృతి; రాస
డలేశ్వరి, జగన్మాతృస్వరూపిణి. 2. లోకదృష్టిలో స్వామి
రకరకాల చుట్టరికాలు గల స్వైర విహారధీర, ఈ రెండవ
తి సమన్వయం ఆధారంగా వంగ, తమిళాది సాహిత్యా
తెలుగు సాహిత్యంలోను విపరీతమైన కావ్యపరంపర
ఈ కథను వివాదాస్పదం చేసింది. అందుకు కావలసిన
-లు బ్రహ్మవైవర్తంలోని శ్రీకృష్ణ జన్మఖండంలో ఉన్న
శావవృత్తాంతాలలో కనుపించడం గమనించ దగింది.
కథలు గాథలు అల్లుకొని సంకీర్ణమైన రాధాకృష్ణ కథా

గహనంలో రామకృష్ణుని రాధాదర్శనం రమ్యోద్యాన మని చెప్పవచ్చు.

**కథ :-** " మధుకైటభవిరోధి మాయామానుష విగ్రహంబు నంగీకరించియు నమానుషంబులగు విక్రమ విశేషంబులం బ్రవర్తించుచుండె. నంత నట మున్న యవ్వెన్నునకు మనః ప్రీణనంబుఁ గావింపఁ దలంచి విరించి నిఖిల భువన మోహిని యగు నొక్క శక్తిం బుట్టించుటయు. నమ్మత్తకాశిని తదాదేశంబున నందు మఱంది యగు శతగోపుండను గోపాలునకుం గూరిమి పుత్రియై పెరుగు చుండె -- " " ఆరాధామాధవులకుఁ గోరిక లన్యోన్య హృదయ కోటరమ్ముల నంకూరితములయ్యెం దినముఖ వారిజ గర్భముల నొప్పు వాసనల క్రియన్ — " రాధ మాధవుందనకు నధినాథుంగాఁ గోరి గోవర్ధనాచల సమీపవర్తియగు ఋణ విమోచన తీర్థంబు నన్ దపంబు సేయం గడంగె—" " తపంబుఁ జేసి రాధ కృతార్థయయ్యె నయ్యాదవ కిశోరుండునుఁ గృశోదరీ సాహాయ్యుండై మాయా శబలితుండగు జీవపురుషుని వరుసన వివిధ భోగ పరాయణుండై ప్రవర్తించుచుండె. " ఈ నాలుగు వర్ణనలు కథాసౌధానికి నాలుగు స్తంభాల వంటివి. ఇవి ఆధారంగా ఆంధ్రసాహిత్యం

లో మొదటి సారిగా రాధాకృష్ణ పవిత్ర దర్శనాన్ని రామ కృష్ణుడు అవతరింప జేశాడు. ఈ తృప్తితో కథను చూచిన వారుకాని. రచించినవారు కాని ఆయన తరువాత తెలుగుసా హిత్యంలో ఎక్కువ మంది లేరు.

**రచనా విశేషాలు :–** రామకృష్ణుని రాథ తపోమార్గం లో స్వామితో ఐక్యాన్ని సాధించిన ఒక మహాతత్వానికి ప్రతీక, ప్రకృతి తత్వం. ఆమెను గురించి నిఖిల భువనైక మోహిని అనడం లోనే ఆమె శక్తిస్వరూపిణి అనే విషయాన్ని కవి సూచించాడు. ఆ శక్తి ఈ కథలో మోహినిగా స్వామికి మనఃప్రీణనము కల్పించడానికి ఉద్దేశించింది. అంటే విశ్వవిరా ణ్మూర్తి అయిన ఒకే పురుషునికి విలసన పూర్వకమైన ఆనంద కత్యను కల్పించడానికి అవతరించింది, అలా అవతరించడం అంటే స్వామికి చెందినదే అయిన ప్రకృతి లీలార్థం కాసి ల్లడమన్నమాట. ఆయన తత్వంలో లీనమై యుండి ఎప్పటి కప్పుడు బాహిరిల్లుతుండే ఇచ్ఛా. క్రియా జ్ఞానశక్తులు జ్ఞాపక ము చేయనిదే అవతార ప్రయోజనము పూర్తిగా నెరవేరదు. అయితే ఈ రాధాశక్తిలో మోహానత్వం కొసరు. ఇది స్వామి

నాశ్రయించుకొని ఈ అవతారానికి ఇతర అవతారాలలో లేని మహా మోహనగుణాన్ని ఆపాదించింది.

రాధని వర్ణించేటప్పుడు సాహిత్యలోకంలో అమలులో ఉన్న ఉపమా సామగ్రి నంతటిని రామకృష్ణుడు అంకించుకొని కడముట్ట వాడి మరీ విడిచాడు. ప్రకృతిలో సౌందర్య స్థానాలైన వస్తు విశేషాలన్నిటినీ కేవలం కవి సమయాలు అనే సామాన్య స్థితిని దాటి స్వస్వరూప ప్రతీకలై పాఠకుడికి దర్శనమివ్వాలని, ఈ దర్శనానికి పరమధ్యేయమైనది, పూరకమైనది పురుషతత్త్వమనీ ఆయన ఉద్దేశ్యం. ఇలాంటి చోట్ల ఆయన మామూలు ధ్వని సిద్ధాంతానికి పై మెట్టున ఉండి వేద శిఖలను ముట్టుకుంటాడు.

" బిసరు హాసన కటిసీను పృథివి యగుట
నిక్కముటుఁ గాక యున్నఁ బై నెలవుకొన్న
కాంచియును, మధ్యమాయయు గమ్రనాభి
లక్ష్మియును ద్వారవతియు సలక్షణముగ "

" వాసుదేవాది నవశక్తి వైభవంబు
రుక్మిణీ సత్యభామల రూపరేఖ
ఇదియె వహియించు నిన నల్వోయిడిన పదునొ
కొంటి లెక్కన కను బొమ్మలు విడకమరు—

మనకి కనిపించే ప్రకృతి స్వరూపాలు, వాటిలో అందాలు అన్నీ పరమపురుష తత్త్వ నిర్దేశకాలుగా పొడకట్టాలి. ఆ పరమపురుషుడు తొలుత పృథ్వీ తత్త్వానికి, ఆటుపైన ఆకాశరూపమైన నీలతత్త్వానికి, ఆతరువాత సర్వాతిశాయియైన శ్రీ తత్త్వానికి అంతర్యామి యైన ప్రతీకగా ఉంటాడు. అన్నవైదిక దర్శనాన్ని కటిసీమ పృథివి, భూమధ్యమాయ, నీల కమ్రనాభి లక్ష్మి అన్న మూడు రూపకాలలో ముచ్చటగా చెప్పేశాడు. రెండవ పద్యంలో స్వామి విభూతి నవశక్తి సహితమై మొదట బ్రహ్మదేవునికి అంటే ఒక వ్యక్తిలో ఉన్నసృజనాత్మక కేంద్రానికి అవగతమవుతుంది. దానిని అతడు అంకెలలోను, వాని వెనుకనున్న ప్రజ్ఞా కేంద్రాలలోను వ్యక్తంచేస్తాడు, అనే విషయాన్ని సూచించాడు. అష్టప్రకృతులకి స్వామి నవముడై ఉంటాడు. ఈ సంఖ్యకి రుక్మిణీ సత్యభామలు అనే

నాయికలను చేరిస్తే ఏకాదశ తత్వం సిద్ధిస్తుంది. అది రుద్రి రుద్రుడు రోదసి అంతా వ్యాపించి యున్న అన్ని రకా లకీ, వ్యక్తులకీ, రూపాలకీ గుర్తు. రాధకి శివునితో బ్రహ్మాండాది పురాణాలలో వ్యాపించిన సంప్రదాయ స్యము. కృష్ణునికి పార్వతితో ఉన్న అభేధం లాంటిది. వైదిక సంప్రదాయ రహస్యాలను అలవోకగా ధ్వనింప డు రామకృష్ణుడు.

రాధాకృష్ణుల అనురాగాన్ని తొలుత ప్రస్తావిం దానిలో ఉన్న తపోగమ్య తత్వానికి రామకృష్ణుడు పదిక వేశాడు.

" ఈ ధారన్ భువనైక మోహన కళాహేలా
విలాసం

రాధా కన్యక భవ్యకాంతిః దనరారన్ దద్వ

గోధుగ్బాలక దివ్యమూర్తి యగు
శ్రీ గోవిందుడం

మాధుర్యంబున కగ్గలించునళిసమా గ్రిడాకృ
తింగ్గా

ఈ పద్యంలో పద్మానికీ, తుమ్మెదకీ ఉన్న అనుబంధం శాశ్వతమై ప్రకృతి పురుష సమ్మేళనాన్ని సూచిస్తుంది. హృదయ పద్మము చేతనా స్థానంగా తుమ్మెద అందలి మాధుర్యాన్ని చవిచూడటానికి తహతహలాడే పరతత్వంగా, దాని ఝుంకారం ఓంకార నాదంగా ఒక సాధనమార్గం ఇందులో ధ్వనిస్తుంది. స్వామిమీద అనురాగం రోజురోజుకీ పెరిగి చిగురు చేవవలె గట్టిపడిందట. రాధ స్వామిని తనకు "అధినాధునిగ" కోరింది. అందుచేత తపస్సు మొదలు పెట్టింది. ఇతరుల లాగ స్వామిని నాధునిగా పొందడానికి తపస్సు చేయనక్కరలేదు. అధినాధునిగ పొందడానికి తపస్సు తప్ప మార్గం లేదు. రాధ తపస్సును సుదీర్ఘంగా వర్ణించిన రామకృష్ణుడు పరమేశ్వరుని పొందడానికి పార్వతి చేసిన తపస్సుతో సామ్యం కల్పించడం గమనార్హం. దీని వలన మునుపే చెప్పినట్టు రాధాకృష్ణ తత్త్వానికీ, గౌరీశంకర తత్త్వానికీ ఉన్న సామ్యాన్ని ఇతడు బ్రహ్మాండ పురాణ పద్ధతిలో దర్శించి ప్రదర్శించినాడని తెలుస్తున్నది. తపస్సు హేమంతంలో మొదలై ఒక ఆవర్తం తిరిగి శరత్తులో ఫలించింది. ఈ మొత్తం కథలో ప్రకృతి, కాలము, దానిపరిణామము మొదలైన సర్వాంశాలు

తపస్సునకు ఉన్ముఖములై వర్తించినట్లు పదేపదే చిత్రిస్తూ పాఠకులకు జ్ఞాపనం చేయడం ఒక మహా శిల్పం. మామూలు కవులు ఏ విషయాలను అన్యార్థస్ఫురణకీ, సౌందర్య పోషణకీ చమత్కారానికీ, వాడుకుంటారో ఆ విషయాలను రామకృష్ణుడు కావ్యగత మహార్థన్ని నిరూపించడానికి వాడతాడు. ఇది అతని ప్రౌఢోక్తి చాతుర్యము. తపస్సందర్భంలో ప్రకృతి అంతా సర్వాద్వైత సమాశ్లిష్ట మార్గమున వ్యాపించినదట. దీపముపోగా చీకటి, కోపముపోగా శాంతమువలె కారు కాలము వచ్చింది. కోకిల నీలము, జలధర పాళము శివస్వామి కంఠనీలిమ వలె నున్నవి— ఇలాంటి వర్ణనలన్నీ కాలస్వరూపానికి చిత్రణాలు. ఈ కాల స్వరూపమే శివుడు. ఆయన్ని తనలో ఆహారించుకోవడం రాధా తపస్సులోని ఆంతరరరం. మఱి కృష్ణుడు ప్రసన్నుడు కావడం అంటే పార్వత్యంశముగా ఈవరకే తనలో లీనమై యున్న ప్రకృతి స్వరూపానికి తోడు ఈ కాల స్వరూపాన్ని కూడా తనలో లీనం చేసి కోవడం. అందుచేతనే స్వామి ప్రకృతి స్వరూపాంగా సాక్షాత్కరించాడు.

" ఇంద్రచాపంబుగా దిది మాళితలమున సవరించు
బర్హి పింఛంబుగాని
భిదుర ఘోషంబుగాదిది పాంచజన్య సంజాత
గంభీర ఘోషంబు గాని
యాశ్రయించిన బలాకావళిగాదిది హారి
ముక్తాహారయష్టిగాని"

వంటి వర్ణనము లిందులకు సాక్ష్యము. "నీలగిరి గప్పు వెన్నెల నిగ్గువోలె" స్వామి రాధ అగ్రమున "అద్రిజ నేలిన శూలిపోలికన్" నిలిచినపుడు చరాచర సృష్టి అంతా ఒక్క ఊపున సంచరించిది. రాధా సంగమ ముదితుడైన స్వామినిగని యోటువడిన రీతి శంపాధరం తెరలింది. నీలాంజన వర్ణుడైన స్వామి లీలావతియైన రాధను పెనగినప్పుడు ప్రకాశించుచున్న రీతిగా "కాలము శరత్సమాగమ హేలాసౌభాగ్య మహిమ నేపు వహించెన్". ఈ సర్వకాలస్వరూప, ప్రకృతి స్వరూప, సంచలనాలన్నింటినీ తనలో లీనం చేసుకొన్నట్లు "ముదిత శతగోప కన్యకా వదన తులిత లలిత రుచిఁ బొల్చె రాకా కళాధరుండు" శివ స్వరూపంతో రమ్యమైన సామ్యం చెప్పడంతో ఈ కథార్థాన్ని సంపూర్ణ

ముగా వ్యాఖ్యానించి నట్లుంది. రాకాకళాధరుడు శివుడే
కదా!

ఇక మీద ప్రకృతి అంతా రాధా మాధవ
శృంగార విలాసానికి ఆకృతి. క్రొత్త మంకెన పూలమీద
తుమ్మెదలు వ్యాపిస్తే స్వామి రాధ పెదవుల మీద ఉంచిన
దంతక్షత రేఖలలాగ కనిపిస్తాయి. పాంచజన్యము రాధ
కంధరకు ఓడి పోయింది. స్వామి సప్తస్వర విన్యాస పూర్వక
మైన మురళీ రవాన్ని వ్యాపింపజేసి "కృశోదరీ సహాయుండై
మాయా శబలితుండగు జీవ పురుషుని వరుసన" వివిధ
భోగాలను అనుభవించాడు.

ఇలా రామకృష్ణుడు రాధాకృష్ణ సమాగమాన్ని
ప్రకృతి, పురుష, కాల స్వరూపాలు అనే మూడు కేంద్రా
లలో విలసిల్లిన మహా తపస్సుగా, యోగంగా తీర్చి దిద్దాడు.
ఈ అనన్య సంప్రదాయాన్ని అర్వాచీను లెవ్వరు అనుసరింప
లేకపోయారు.

ఒక్క మాటలో రామకృష్ణుని రాధ ప్రకృతి
స్వరూపిణి, తపస్స్వరూపిణి, కాల స్వరూపిణి, శివ స్వరూపిణి.

# ఎక్కిరాలవారి గోద

"...పట్టున పచ్చి తేనె చవిపట్టిన కృష్ణుని వేణుగాన
ముట్టిన సాధువా పెదవి పూచిన అక్షర రూపమిచ్చి
అని తన మాతృమూర్తికి గోదా వైభవ కావ్యాన్నిం
కితం చేసిన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులవార
ద్గురు పరంపరలోని వారు. కవిగా, పండితునిగా, సర్వ
త్ర ద్రష్టగా, భిషగ్వరునిగా, అన్నిటినిమించి యోగ
ర్తిగా నేల నాలుగు చెరగులా ప్రసిద్ధులు. పై లక్ష
లలో ఒక్కొక్కరికి ఒక్కొక్కటి తొలుత ప్రీతి పాత్రమై
"అనిపించినా అందరికీ అన్నీ ఆకర్షణ కేంద్రాలై వెరసి
ముద్ద కట్టినట్లు. పరతత్త్వము కళ్ళముందే మసలి

వెంటబడి వెన్ను తట్టినట్టూ భాసించే వైభవం వారిది. ఈ యుగానికి సరిగ్గా యిలాంటి విభూతే కావాలి అని లక్షలాది సాధకులు వారి పాదంముట్టి ఇది ప్రయాగ అని తరిస్తూ చుట్టు ప్రక్కలవారిని తరింపజేయడం అంతరమూ చూస్తున్న సత్యం. అలాంటివారి కావ్య వైభవం సాహిత్యం కొలమానాలకు, విమర్శ సులోచనాలకూ అందుతుందని కాక సద్వస్తువు యొక్క స్మరణ, అను శీలనము ఉపాదేయాలు అన్న స్వార్థంలో ఇలా వ్రాయడం.

దాక్షిణాత్య వైష్ణవ సంప్రదాయానికి పట్టుగొమ్మలైన ఆళ్వారులలో గోదది అనిత రస్థానం. ఆమె జీవితము. సాధనా కొన్ని జన్మలకు పనికి వచ్చే మంత్రంగా మానవ జాతికి నిలిచిపోయింది. అదే మధురభక్తి. స్వామిని నాథునిగా పొందడానికి తపించి ఆయనలో ఐక్యం కావడం అన్నది పూర్వ చరిత్రలో గోపికలు, రాధ మొదలైనవారు పొందిన మహాపదవి. ఇలాంటి నాయికలు భంగ్యంతరంగా స్వామి ఒక్కడే పురుషుడనీ (తత్త్వతః) మిగత సృష్టి అంతా స్త్రీమూర్తి (ప్రకృతి) అనీ నిరూపించారు. గోదకథ ప్రసిద్ధ మార్గంలో నడచిన పూర్వ కావ్యాలు ఉన్నవి. వారిలో గోద

జీవితము, భావసంస్కార క్రమోన్మీలనము మొదలైన అంశాలు ఒక సంపూర్ణ కావ్య ప్రణాళికకు తగిన విస్తృతి పొందక పోవడంవల్ల ఎక్కిరాల వారు దానినొక స్వయం పూర్ణ కథా కృతిగా తీర్చిదిద్దారు. ఆయన అన్నారు:

"సంప్రదాయ గ్రంథములలో లభించిన గోద కథలో కావ్యమునకు సరిపడునట్టి విస్తృతి లేదు. గోదాదేవి జీవితమునకు సంబంధించిన సన్నివేశము లేవియు నీకథలో సేకరింపబడ లేదు. . . ప్రస్తుత కావ్యమునందు గోదావైభవ మొక్కటే యుద్దేశింపబడినది. కావ్యత్వసిద్ధికై సన్నివేశములు స్వతంత్రముగాఁ గల్పింపఁ బడినవి. అవియును సంప్రదాయ కథలోని పరమార్థమునకు విజాతీయములు కాకుండునట్లు ఉపబృంహణాత్మకముగాఁ గల్పనఁ జేయఁబడినవి". కథలోని స్థూలరేఖ ఇలా ఉన్నది: గోదకుయౌవనం వచ్చినపుడు విలుబుత్తూరు లోని మదన గోపాలుడు ఆమె శృంగార భావాలకు కేంద్రమైనాడు. రోజూ గుడికి పోవడం, స్వామిని సేవించడం అలవాటై అదే మధురానుభూతిగా మారి చెలులలో బాటు గోపికల కాత్యాయనీ వ్రతంవంటి దాన్ని జరిపి స్వామికి బాగా

దగ్గరైంది. ఆయన కన్నుల్లో కన్నులు కలిపి శృంగార భావాలు. పొలయలుకల విలాసాలు. మమతలూ అన్నీ రుచి చూచింది. కొలనిలో స్నానంజేసి వస్తున్నవేళ రవ్వల ఉంగరాల నూతనుడు ఎవరో తనను చేరదీసి సరసమాడిన అనుభూతి. తన జడలోని ముద్దబంతి మాయమై స్వామి వేణువుపై ఉండడం. వంటి చిత్రాలతో స్వామి ఆమెను త్రిప్పుల బెడతాడు. ఆమె వదన పాండిమ. కఠోరదీక్ష చూచి దిగులు పడి విష్ణుచిత్తులు స్వామికి ఆమె వృత్తాంతం నివేదించు కొంటారు. ఈ లోపున హేమ అనే చెలికత్తె స్వప్నంవల్ల తాను పూర్వజన్మలో సత్య అనే విషయం లీలగా ఆమెకు తెలిసింది. స్వామిని తానేకోరి పొందిన స్వప్నంలో తనకే ఆయన తీక్షమూర్తియై ధర్మాను శాసనం చేశాడు. స్వామి ఆదేశం మేరకు విష్ణుచిత్తులు సకుటుంబ పరివారంగా రంగనాథ సేవకి వెళ్ళడం. అక్కడ గోద రంగనిలో లీనం కావడం, విష్ణుచిత్తులు తిరిగివచ్చి స్వామిని ధర్శించడం. స్వామి దయ వల్ల గోదమళ్ళీ అగపడడం. స్వామి ఆజ్ఞమేరకు గోదా శ్రీ రంగేశ్వరుల వివాహం లోక లోకాంతర వైభవంతో మదన గోపాలుని అజమాయిషీలో జరగడం— కథలోని

ఇతరాంశాలు. గోదమ్మను మేనబావకిచ్చి వివాహం చేయాలనుకోవడం మొదలైన చిన్న వృత్తాంతాలు ఈ సువ్యవస్థిత కథకు ప్రక్కదీపాలుగా వెలుగుతవి. అనన్య సాధ్య కథన కౌశలంతో బాటు అసాధారణ భావ, రచనా విన్యాసాల మూలాన ముప్పది రాత్రుల వృత్తాంతాన్ని ముచ్చటగా చెప్పిన యీ కావ్యంలో మొదటి పద్యం చదివేంతవరకే సహృదయుని వంతు. అటుపైన వాక్కుకి మనస్సునకు అతీతమైన ఏదో శక్తి అతన్ని పట్టిలాగి తుదిముట్ట చదివించి మరీ వదులుతుంది. ఈ లోపున అతడు భావక్షాళనం పొంది మహోపదేశం పొందిన మనీషిలాగ ఈవలకు వస్తాడు. ఆ ఉపదేశం అతని జన్మ జన్మాంతర సంస్కారాలను కదలించి అమృత పథంవైపు మరలిస్తుంది. అది శాశ్వత సాధనగా అతడు తరిస్తాడు. అందుకే ముందుగా అన్నాను. ఇది జన్మ జన్మలకీ పనికివచ్చే మధుర భక్తి మంత్రం తాలూకు పుస్తకము. అని. ఇలాంటి పుస్తకాలు తెలుగులోనే కాదు. ఏ భాషలోనైనా మహా ఉంటే వ్రేళ్ళమీద లెక్కించదగినన్నే ఉంటవి. వ్యాస వాల్మీకి కాళిదాసాదులు ఎంతమంది ఉన్నారు గనుక ప్రపంచంలో!

మార్గ శీర్షపు మొదటి వేకువలో అనిపిస్తుంది గోదక్కి

"ఇది యెల్లన్ వ్రిజరాజు పల్లె సతతం బిందున్న
బంధు వ్రిజం

బిది యెల్లన్ ప్రజబంధు బంధుర తను స్ఫీతార్ద్రి
కాంతి ప్రిభా

భ్యుదితానేక తటిదుృచుల్! గృహము శ్రీభావల్లభ
శ్రీ పదా

స్పదశేముత్కర భావ భావితము సంపత్పూర్ణమై తోచెడిన్"

ఇలాంటి సౌందర్య భావాస్పద సీమలు కావ్యం నిండా కొల్లలై సహృదయుడు తలదాచుకొని కాస్సేపు కలి ధర్మానికి దూరంగా ఉండడానికి వీలుగా ఉన్నవి. ప్రికృతిలో అణువణువు కథా సౌధానికి తాపిన మణి మాణిక్యాలలాగ అందాన్ని ఇస్తవి.

"మార్గ శీర్షానఁ జింతల మలచు చవులు మధువు నెల పండునుసిరిక మధురిమములు సవతులై... " కథ నడుస్తుంది

స్వామి మాటల్లో స్థలాంతరాన చెప్పించిన కథా సూత్రం ఇక్కడే ధ్వనించడం విశేషం." వినుమీ రీతిని భార్య లీర్ష్యం గొనంగా వేసారి సంసారినై ..." అన్నాడు జగన్నాటక సూత్ర ధారి. గోద కథా ప్రారంభంలోనే ఒక నిశ్చల తత్త్వం అలవ రించుకొన్న నాయిక. "స్వామి యన్నము, స్నానము స్వామి నాకు తల్లి తండ్రియు. జెలికాడు స్వామి యింక..." అంటుంది. అంత మాత్రంచేత తనకొక్కతెకే స్వామి దక్కా లన్న నిష్కర్ష ఆమెకు లేదు. అసలు నాయికయైన భూదేవికి లేదు. సత్యకి ఉన్నది. ఈ జన్మలో ఆమెకి ఉత్తర రూప మైన గోదకి ఆ కాస్త మమతా బంధమూ వదలి 'మనకతం డొక్కండెగానీ మనబోటులు ప్రాణులెంత మంచి యతనికో మనది మమకారం, మతనిది మనలనుం బుఃకించు ప్రేమ మార్గము చెలియా' అన్నది. ఈ సంస్కార పరిణామం పొందిన సత్యను ఆధారంగా సమస్త మానవ జాతినీ కటా క్షించడమే ధ్యేయమైన స్వామి తత్త్వాన్ని ఈ కావ్యం ఆవిష్క రించింది. ఒక్క క్షణం గోదకి తాను భూదేవినన్న స్ఫురణ వచ్చింది. "స్వామి చూపుల సృష్టి సంపదకు మురిసి ధారుణి నను క్షణమాత్రం దలంచుచుంటి" అనుకున్న నాయికకు చెలి

కత్తె హేమ తన స్వప్న వృత్తాంతాన్ని చెబుతూ సఖియా!
చెప్పిన నమ్మవు సరిగ సత్యభామఁ జూడఁగ నీవను భ్రాంతి
గలిగె అనగానే ఉలిక్కిపడి "తప్పనుమీ యాదకు మం
తటి పెద్దమాట లా మునిజన సేవ్యమాన పరిపూత చరిత్రకు
సత్యభామకున్ మనకును సాటియా చెలి?" అన్నది. అ
మునిజన సేవ్యమాన పరిపూత చరిత్ర తానే అయినది. మఱి
చెలిహేమ స్వప్నం చేత ధన్య అయినదే తనకో? అన్న
కోర్కెను స్వామి తీర్చడం ఈ కావ్యమణి హారంలో నాయక
మణి. భూమ్యాకాశాలు తాకినంత మేర ఎవ్వరూ లేనిచోట
పైడి మువ్వల రథంమీద అయిదు గుఱ్ఱాల నదుపు పెడు
తున్న స్వామి (పంచేంద్రియ పంచతత్త్వ పంచ భూతాదులకు
ప్రతీక) ధర్మ సందేశం ఇచ్చాడు. ఈ సందేశం సర్వ
తత్త్వ సారం. సర్వ జీవులూ సాక్షీ భూతుడనైన నానుండి
సాగివస్తున్నవి. నేను ధర్మ రూపంలో మీలోనే దాగిఉన్నాను.
శూన్య గగన సీమలో ఇమిడి ఉండి భూమికి అవతరిస్తున్న
నాలో కాల గోళంసైతం కరగి పోతుంది. నా గురించిన
ధ్యానము వ్యామోహం కారాదు. సర్వ సమర్పణ జేసిన
వారి భారం నేనే వహించి హితము చేస్తాను. సాధకులు

తమకు నచ్చిన వానిని కోరికలుగా కోరరాదు. ధర్మమనేది నా సంకల్ప మర్మం— ఇలా సాగివచ్చింది గోదకు బోధ. అనంతర కథలో ఆమె సర్వాత్మనా స్వామికి సమర్పణ చేసికొని "నీవు నాదాన విదిసుమ్ము నిశ్చయమ్ము" అనే వాగ్దానం పొంది తపస్సు పండించుకొని ఆ గుడిలో స్వామి ఆజ్ఞ మేరకు రంగనాథ రాజ్ఞి అయినది.

*

ఈ కావ్యంలో శ్రీరంగ యాత్ర ఒక మధురఘట్టం.

"ఆకాశాంతర తత్త్వలగ్న పురుష వ్యాకీర్ణ రశ్మిచ్ఛటా

ప్రాకారోన్నత గోపురాంతర ఝటి ప్రధ్వాని

ఘొంకారమున్

శ్రీకుంజ ప్రసవావళీ సురభిళ స్విన్నాస్య రంగేశ్వర

వ్యాకీర్ణాళి పథంబు"— గోదకి మాఘమం స్వామి ఆదేశము.

(ఇలాంటి దార్శనిక కవుల విషయంలో సమాసం కట్టడం బాగున్నదనీ తెనుగు దనం పోషించారనీ చెప్పడం కోటీశ్వరునికి మంచి కారున్నదని చెప్పడం లాంటిది. అయినా

అను శీలన మర్యాద ననుసరించి ఒక్క ముక్క చెప్పాలి. ఎక్కిరాలవారి శైలి అటు సంస్కృతమైనా యిటు తెలుగైనా హృదయపు లోతులను తాకుతుంది. వీణాలు మోగిస్తుంది, బొమ్మలు కట్టిస్తుంది. 'కాలు సేతులు వడకెను కదలె పెదవి చిరుచెమట మొగ్గదొడిగె గగుర్పు మేను' అని తెలుగులో బొమ్మ గీసినా, కేళీ కల్పిత నాభి పల్వల నటత్ క్రీడా సరో జానత వ్యాలోలాంబర బంధుర శ్రుతిశిరః పాదద్వయీ కోమలా! అంటూ స్వామి కదలివచ్చే సంబోధనలు చేసినా, వైదిక కవుల సంప్రదాయంపైని మక్కువతో విషమవృత్తాలు నడిపినా పరమ మాధుర్యము, సొగసు, తూగు అన్న లక్షణాలు తప్పనిసరిగా ఉంటవి.)

యాత్ర, కల్యాణము ముగిశాక స్వామి నోట ముచ్చటగా రంగ తత్త్వాన్ని ప్రవచించారు.

'రంగనాయిక గోదయై రహి వహింప రంగ మంగళ
మూర్తియై రమ దలిర్ప
రంగ వర్ణము నీలమై రాణమించ రంగమూర్తిగ
నేనుందు రంగమందు.

*

ఉత్తమ పాత్రిచిత్రిణ అంటూ విమర్శకులు చెప్పేది రమ్య విషయం. కళ్ళముందు పాత్రలు కదలాడి వాటి మాట మనస్సు మనకి అవగత మవుతుంటే నిజంగా రసలోకపు తోవలు విచ్చుకుంటవి. అంటే భావాలు మనస్సులో చొచ్చుకుంటవి. ఆ దృష్టితో చూస్తే విష్ణుచిత్తులు. ఆయన ఇల్లాలు మొదలైన వారంతా సజీవ శిల్పమూర్తుల లాగ విహరిస్తారు.

'తరిపి వెన్నెల దిద్దిన యూర్ధ్వ పుండ్రముల్ పస కనుగోసలం దోలుక' దివ్య ప్రబంధ పరిమళ భవ్యానన పద్మమూర్తి విష్ణుచిత్తులు స్వామికై కావ్యము కల్పించి చదివిన ముచ్చట. గోద శ్రీరంగంలో రంగనిలో లీనమై నపుడు "ఎందఱు కన్యకామణుల నెత్తుకపోయితి వేమ యిట్టులో సుందర రావణాసురుడ! అంటూ స్వామిలో కనుల నీరొలుకుతూనే తగువులాడిన రచ్చ; యోగమార్గంలో వివాహానికి సమస్త దైవత సమాహ్వానంచేస్తూ విఘ్నేశ్వరు నిలో "అయ్యా! పెండ్లి మొదట నిన్ను విన్నవిస్తేన పదము తోడ బిలుచుకొందును విఘ్నముల్ మొలువనీక పెండ్లి నడిపించి సాపడి వేడ్కచూపు' అని పిలిచిన యొతుపు;

సంప్రదాయ వైష్ణవ వృద్ధస్వాములను తలపిస్తూ చర్వణ యోగ్యంగా ఉంటవి. ఆయన ఇల్లాలి మాటల్లో "చీకు చింతయు నెఱుఁగరు చెదరబోరు అంటి యంటని సంసారి యమలమూర్తి". ఆ యిల్లాలు 'ఇలవేల్పు తాను నరుడు కాదంటంచును చిన్నగా జ్ఞప్తిగలదే? తల్లితో పరాచికములు తగదు నీకు- అని ఒకసారి మందలించి మరొక సారి మేన మామల సంబంధమైన నీకు నచ్చెనా యింత భారము నాకుఁ దిరు కాదయేనియు సంతోష మేదియైన నీకు నచ్చుట మా వ్రతనియమ మమ్మ' అన్న సౌజన్య స్వరూపిణి, సంస్కార మెఱిగిన సంసార పక్షపు స్త్రీ. మడతల యుత్తరీయంబు మెడను దీర్చి గరుడాళువారుల తీరుగాగ మీసముల నామ ముల గోద మేనమామ. కులికే బొద్దురంగడు—ఇలా ఎవరికి వారు మనతో మాట్లాడి భావాలుకలబోసి కావ్య జగత్తు లోకి లాక్కొని వెళ్ళుతారు. పలుకుబడి సోయగాలు- లోక వ్యవహార నిరూపక ఘట్టాలు చిత్రించడంలో కవి సిద్ధహస్తుడు. వివాహ కాండలో ముత్తైదువుల హాస్యాలు, ఆయా సందర్భాలలో చేసిన వర్ణనలు ఈఅంశాన్ని నిరూపిస్తవి. సప్తర్షుల భార్యలు "తొలుతన్ నింగికి బొద్దుకోయు నెడనే

తూర్పో పశ్చిమానా కృతిన్ మొలకై మొగ్గయి మేదురేక
లోలసేన్ పుణ్యాత్ములా వీడు రూపులుగా" అనడం.
నారదుఁడు ఆ పరిమళముయొక్క ఊర్పు. పుష్పాడి రేణువులు
నలువలు. అనడం ఇలా భూనభోంతరాలు పట్టని కవితా
రూప చిత్రిణలో (POETIC IMAGE) ఎంత అందమో అంత
తత్త్వము. ఎంత తత్త్వమో అంతలోక వృత్తానుశీలనము
ప్రతి బింబించడం ఏ కొద్దిమంది కవులకో తప్ప చేతగాని పని.

*

చివరి ఘట్టంలో స్వామి లోకహిత కార్యానికై
వైకుంఠ ద్వారపాలకులు కల్పించిన అవతరణము. నాయికల
పరస్పర మాత్సర్యములు అనే విషయాలను తాత్త్విక రమ్య
ముగా తీర్చి ప్రవచించాడు. కొందఱు యోగమని శ్రమ
పడడం. భోగమని లాలసులు కావడం. శాస్త్రమంటూ సాగ
దీయడం. కర్మ అంటూ కష్టపడడం. భక్తి అంటూ వ్యా
మోహపడడం. మతమంటూ మమత చూపడం. నిందిస్తూ
నాస్తికులు కావడం- ఇలా అందరూ తాను రచించిన నాట
కంలో పాత్రల లాగ వ్యవహరిస్తారనీ, తాను పది పాత్రలు
వేసే ఏక నాయకుడననీ (ద శా వ తా ర మూ ర్తి) చెబుతాడు.

సత్త్వ బంధురము. ఊహాతీతము అయిన ఆనందము సర్వులకు ధ్యేయమంటాడు. ఆ ఆనందాన్నే సహృదయుల కిస్తుంది కావ్యం. సత్యస్వరూపుపై ఆశ్రయ బుద్ధితో చదివినవారికి ఈ కావ్యంలో

"పరిమాణంబని కాలదేశమని యొప్పన్ రాని
యానంబుగా
చరమ స్థాయి మనస్సు లీనమగుచున్ పొందా ప్రను
భూతి ప్రభాం
తర మాధుర్య తరంగ డోలికలలో దారాడి
యెందో చనన్
వరుసన్ లోకములేవో విచ్చుకొని త్రోవల్ త్రోవ్వలై
తోచంగన్"

ఒక మహానుభూతికలుగుతుంది. ఈ కావ్యాన్ని పారాయణంచేసి శుభాన్ని పొందిన ధన్యులున్నారు. కావ్యంగా రసోపనిషత్తు. తత్త్వంగా సర్వదర్శన సారము. అనుభూతిగా ఆనందైకమయము- అయిన యీ కావ్యాన్ని తెలుగు పాఠకులు కన్నులకద్దుకొని పదే పదే పఠించాలి.

: —— :